For the first time in India the revolutionery electronic engraving machine in action

# VARIO KLISCHO GRAPH



WHAT IT MEANS TO YOU

Block making time reduced from days to a few hours ■ Electronic control of gradation and detail sharpness ■ Electronic adjustment of colour correction

CHANDAMAMA PRESS - CHANDAMAMA BUILDINGS - MADRAS-26



# నేర్చుకొనుటకు పశితనం ప్రతిబంధకంగాదు

అందమును, రంగును మెచ్చుకొనుట చిన్నపిల్లకు సీతాకోక చిలుక నేర్పుచున్నది. అత్యల్పమైన మరియు సౌమ్యరూపంలో సహితం జీవితమును విలువైనదిగా లెక్కగొనుట ఆమె నేర్చుకొనుచున్నది.

మీ పిల్లలకు మీరు ఇప్పుడు నేర్పవలసిన మరియొక పాఠము. పళ్లు మరియు పనుచిగుళ్ల పట్ల రోజూ శ్రద్ధవహించుట, అందువల్ల భవిష్యత్తునందు కొన్ని సంవత్సరాలలో దంతక్షయం మరియు పనుచిగుళ్ల జబ్బులబారి బడకుండా వారిని కాపాడినందుకు వారు మీకు అభివందనములర్పింతురు. వారి పళ్లను మరియు పనుచిగుళ్లను ఫోర్‌హన్స్ టూత్ పేస్టుతో తోముకొనుచూ భద్రపరుచుకోమని మీ పిల్లలకు నేడే బోధించండి. దంత వైద్యుని చేత తయారు చేయబడిన ఫోర్‌హన్స్' పనుచిగుళ్లకు గుణకారియైన డాక్టర్ ఫోర్‌హాన్ యొక్క ప్రత్యేక పదార్థములు గల టూత్ పేస్టు ప్రపంచంలోకెల్ల ఇది ఒక్కటే. రోజూ వాడుచున్నయెడల పళ్లు తెల్లగా మెరయుచూ, పనుచిగుళ్లు గట్టిగాను ఆరోగ్యవంతంగాను వుండును. "CARE OF THE TEETH AND GUMS" అనే చిన్న రంగుల పుస్తకం ఉచిత ప్రతి కోసం తపాలా ఖర్చుల నిమిత్తం 10 న.పై. తపాలా బిళ్లలను పంపండి: మేనర్స్' డెంటల్ అడ్వయిజరీ బ్యూరో, పోస్టు బ్యాగ్ నం 10031, బొంబాయి.




C. 1

**COUPON**

Please send me a copy of the booklet
"CARE OF THE TEETH AND GUMS"

*Name* ______________________

*Address* ______________________

______________________

# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★


భారతచరిత్ర - 59 ... 2
నెహ్రూ కథ ... 5
పాతాళదుర్గం - 4 ... 9
లక్ష్మీకటాక్షం ... 17
రాజుకొడుకూ—
మంత్రికొడుకూ ... 23
అపవాదు ... 27
కలవపిల్లలు ... 33
పిశాచాలతో చెలగాటం 44
రామాయణం ... 49
అరణ్యపురాణం ... 57
ప్రపంచపు వింతలు 61


ఇవి గాక ఫొటో శీర్షికల పోటి
మొదలైన మరి ఎన్నో
ఆకర్షణలు.




అన్నివంటలకు శ్రేష్ఠమైన
నూనెలు




అగ్‌మార్కు కాబడిన
ఎ.యస్. బ్రాండ్
చాయపప్పు
నూనె




అగ్‌మార్కు కాబడిన
మేన్షన్ బ్రాండ్......
నువ్వులనూనె

● గిరాణావరిడెల్లా నువ్వులనుండి ఆరోగ్యకర
ముగు ప్రత్యేకపద్ధతులతో తయారుకాబడినవి.
● రుచి, రంగు, సువాసనలతో అన్నివంటపదార్థ
ములను అమితమగురుచికంతముగ చేయును.
● ఊరగాయలను చాలకాలము నిలువయుంచును.
ముక్కను మెత్తబడనీయవు, బూజుపట్టనీయవు.
● తలకు వాడినయెడల మెదడుకు చలువ చేయును.
వెంట్రుకలను బాగుగా పెరుగునట్లు చేయును.
● 16, 4, 2. కి.గ్రా. డబ్బాలలో పేకింగు చేయబడుచున్నవి.

ఏజెంట్సు:
M/s. యిమ్మిడిశెట్టి రామకృష్ణయ్య సన్సు
బరంపురం

M/s. అశోక్ స్టోర్సు
183, శరత్‌బోస్ రోడ్
కలకత్తా 26

శ్రీ N. సత్యనారాయణ
129/L 5, Road No. 11
B. H. ఏరియా, కద్మ, జంషెడ్‌పూరు

MFRS, అంబటి సుబ్బన్న & కో. సామర్లకోట

అతిత్వరలో విడుదల!









సురేష్ ప్రొడక్షన్స

# శ్రీకృష్ణ తులాభారము



దర్శకత్వం:K.కామేశ్వర రావు. B.A., నిర్మాత:D.రామానాయుడు

రచన:సముద్రాలరాఘవాచార్య • సంగీతం:పెండ్యాల • కెమెరా:అన్నయ్య

కళ:రాజేంద్రకుమార్.B.A., • నృత్యం:K.S.రెడ్డి • కూర్పు:మార్తాండ్

VIJAYA ఆంధ్ర-సీడెడ్:విజయ రిలీజ్... నైజాం:వాణీ... మైసూర్:విజయ పిక్చర్స్

# ఆమె పరీక్షల్లో ఫేలయ్యేదే!

ఆమె క్లాసంతకీ ఫస్టుగా వచ్చేది. కాని తరువాత పరీక్షలు దగ్గర పడినప్పుడు ఓపికలేక చదువు వెనక్కు పెట్టింది.

ఆమెను డాక్టరుకు చూపించేము. సరియైన పోషణలేక పిల్లలు కోల్పోయిన శక్తిని మళ్లీ పొందకపోతే ఇలాగే అవుతుందని ఆయన చెప్పేరు.






డాక్టరు చెప్పినట్లే ఆమెకు హార్లిక్స్ ఇచ్చేము. త్వరలోనే ఆమె మళ్లీ ఓపికతో చదువులో పడింది. ఫస్టుగా ప్యాసయింది కూడా!

పిల్లలు త్వరగా శక్తిని పోగొట్టుకొంటారు. వారికి పోషణ కలిగించే ఆహారము ఇవ్వక పోతే త్వరలోనే అలసిపోయి శ్రద్ధగా ఉండరు. హార్లిక్స్ అదనపు శక్తిని కలిగిస్తుందని డాక్టర్లకు తెలుసును. అది పూర్తి మీగడతగిన పాలు, గోధుమపిండి మరియు మాల్టెడ్ బార్లీలతో తయారయింది. శ్రమగా ఉన్న సమయాల్లో హార్లిక్స్ ఎంతో సహాయపడుతుంది.

## హార్లిక్స్

అదనపు శక్తిని కలిగించును!




JWT-HL-3497A

ఆదనపు
తెలుపుదనము
ఎక్కడ నుంచి
వస్తుంది?




# టినోపాల్ తో అన్నింటికంటె హెచ్చు తెల్లదనం వస్తుంది

ఆఖరిసారి బట్టలు జాడించడానికి ముందు కాస్త టినోపాల్ వేయండి-మరిచూడండి. మీ తెల్ల బట్టలన్నీ మిరుమిట్లు గొలిపేలా మెరుస్తాయి. షర్టులు, చీరెలు, తువ్వాళ్లు, దుప్పట్లు—ప్రతీదీ అదనపు తెల్లదనం పొందుతుంది.

ఈ అదనపు తెల్లదనం మూలంగా మీకు ఖర్చు ఎంతో? ఒక బట్టకు ఒక పైసా కూడా కాదు. ఒక డార్జను బట్టలను తెలుపు చేయడానికి ఒక పావు చిన్న చెమ్చాడు చాలు.

శాస్త్రీయంగా తయారుచేసిన లైవర్ టినోపాల్‌నే సర్వదా ఉపయోగించండి. ఇది బట్టలకు ఏ విధంగానూ చెరపు (హాని) చేయదు.



ఇప్పుడు సీలుచేసిన అల్యూమినియం ఫాయిల్ పేకెట్‌లో కూడా దొరుకుతుంది.

ఒక పేకెట్‌తో ఒక డార్జను బట్టలు తెలుపు అవుతాయి. ఉపయోగించడం సులభం—ఎటువంటి వృధా లేదు. ఒక డార్జనుకు ఒక పేకెట్ చాలు.



టినోపాల్, జె. ఆర్. గైగి ఎస్. ఎ., బాల్, స్విట్జర్లండ్ వారి రిజిస్టర్డు ట్రేడ్ మార్కు.
సుహృద్ గైగి లి. పి. ఒ. బాక్సు 965, బొంబాయి-1. బి. ఆర్.

Shilpi SG 223 A Tel


సిటెడెల్ వారి
ప్రేమలో ప్రమాదం
మాటలు - పాటలు
ముద్దుకృష్ణ.
సంగీతం
టి. ఆర్. పాప
నిర్మాత-దర్శకుడు
జోసెఫ్ తలియత్ Jr.
నవయుగ రిలీజ్

ఔనౌను,
నేను కేలరీల సంగతి గమనిస్తాను!



నా కుటుంబం ఆరోగ్యం విషయమై సహజంగా నేను శ్రద్ధవహిస్తాను.
ఆహారం, విటమిన్‌లు కలిగి, శక్తినిచ్చే ఆహారం సమపాళంగా వుండేటట్లు చూడాలి.
కాగా, కనపడ్డదల్లా వాడి చూడను. కొత్తది, పుష్టికరమైన శక్తి ప్రదాయిని
అయిన ఓవోమాల్ట్ నా కుటుంబీకులందరికీ రోజూ ఇస్తాను. అది సమపాళాలు
కలిగిన పోషకాహార పానీయం.

ఓవోమాల్ట్




ఉత్పత్తిదారులు:



ఫుడ్స్ ఫ్యాట్స్ & ఫెర్టిలైజర్స్ లిమిటెడ్
తాడేపల్లిగూడెం, ఆంధ్ర ప్రదేశ్
సేల్స్ అడ్మినిస్ట్రేషన్: 115-బి, నేతాజీ సుభాస్ చంద్రబోస్ రోడ్, మద్రాసు-1

EP-FFP-14 TEL

వెలువడింది!

# విజయచిత్ర

సినిమా

మాస



పత్రిక

ఆగస్టు సంచికలో

సావిత్రి, వైజయంతీమాల, జానకి, కాంచన,
శోభన్ బాబు మరియు 'భారత మాత'గా
పద్మిని వర్ణ చిత్రాలు,
'పర్సనాలిటి'—రచన భానుమతి రామకృష్ణ,
ఇంకా, ఇంకా విశేషాలు.........

విడి ప్రతి: 75 పైసలు



డాల్టన్ పబ్లికేషన్స్

'చందమామ బిల్డింగ్స్' :: మదరాసు-26


**

" ఓ !
అదినావంతు
ప్యారీ
మిఠాయిలు "

అందరూ
పంచుకోండి.
అనుభవించండి.
ప్యారీ
మిఠాయిలతో
జీవితమెంతో
ఆనందము




—విశిష్టరకపు మిఠాయిలను తయారుచేయువారు

మీరు వాడారా : హెల్త్‌ఫ్రూట్స్ ● జింజెర్ స్నాప్స్
లెమన్ బార్లీ . కోకోనట్స్ ● మిల్క్ టాఫీ

ప్యారీస్ కన్‌ఫెక్షనరీ లిమిటెడ్, మద్రాసు

JWT-PRS-3629



## చక్కటి కురులకు
## సౌందర్య పోషణ

నిత్యమూ ఉదయాన్నే 'కేశవర్ధిని' రాచుకొని తల దువ్వుకోండి—నిగనిగలాడుతూ ఎంతో చక్కని కురులు వర్ధిల్లుతాయి. చుండు చేరదు. అందము, ఆరోగ్యకరములగు కురుల పెరుగుదలకు 'కేశవర్ధిని'నే వాడండి.



అప్పటికప్పుడు తాజా వాడుకకు
కేశవర్ధిని రెడీ మిక్స్‌డ్
హేరాయిల్

శుభ్రతకు, పరిమళయుతమైన కురులకు కేశవర్ధిని షాంపూ

**కేశవర్ధిని ప్రాడక్ట్సు,**

27, మాసిలామణి ముదలియార్ రోడ్డు, మదరాసు - 14.



NO. 215, 215C. ఫోను: 245

22 CT. GOLD SHEET COVERED JEWELLS.
అందానికి ఆనందానికి
'నంది' ఆభరణాలు
గ్యారంటీ గలవి.
TRADE MARK
REGD. NO. 192718.
NANDI

తంతి: నంది

NO. 146

NO. 243

NO. 227

NO. 147

NO. 128

Litho.k

# నంది గోల్డు కవరింగ్ వర్క్సు

చిలకలపూడి (P.O) . మచిలీపట్నం (A.P)




అలసిపోయి వేడెక్కిన పాదాలకు చల్లదనము,
హాయిని చేకూర్చుటకు

Air Cool

కరోనావారి చెప్పులు

ఇదిగో, క్రొత్తమాదిరి చెప్పులు! కరోనావారి, గాలిలో తేలిపోతున్నట్లనిపించే చెప్పులు. గాలినిండిన సోల్ గల వింతైన చెప్పులు!

క్రొత్తమాదిరి 'ఎయిర్‌కూల్' చెప్పులకు గుల్లవుండి, చిల్లులుగల సోల్ వుండుటచే వాటిలోకి నిరాటంకంగా గాలి వెళ్లుతూంటుంది. ప్రతిసారి అడుగు వేసేనరికి చిన్న చిల్లులద్వారా గాలి పాదాలకి తగిలి హాయిగా, చల్లగా వుంటుంది. అత్యంత వేసవిలోకూడా చెమటవలన ఏమాత్రమూ చికాకు కలగకుండా పాదాలు పొడిగా, చల్లగా వుంటాయి!

'ఎయిర్‌కూల్' చెప్పులు గాలివలె తేలికగా వుంటాయి. కడిగి శుభ్రపరచగల, వంగే మరియు చిరగని అద్భుతమైన వస్తువుతో అవి తయారుచేయబడ్డాయి. అందమైన అనేక రంగులలో దొరుకుతాయి. ధర రూ. 10.95 మాత్రమే. గాలితో నిండిన కుషన్ లాంటి, మెత్తటి 'ఎయిర్‌కూల్' చెప్పులను ధరించి చూడండి— ఈ రోజే కరోనా షాపులో కొనండి!

కరోనా సాహు కం. లిమిటెడ్. రిజిస్టర్డ్ ఆఫీసు: 221, దాదాభాయి నవరోజీ రోడ్, బొంబాయి-1



తీసుకోండి

గెవార్ట్
# గెవాబాక్స్

# 50% పెద్దవయిన ఆకర్షణీయమగు ఛాయా చిత్రములు

గెవా బాక్స్, అద్భుతమైన దీర్ఘ చతురస్రాకారపు చిత్రములు 6 సెం. మీ. అంత పెద్దవి...సాధారణ కెమేరాలు ఇచ్చే వాటి కంటే 50% పెద్ద వాటిని ఇచ్చును. మరియు నెగెటివ్స్ యొక్క సాటిలేని విశిష్ఠత వలన ఎంతో చక్కటి ఎన్‌లార్జ్‌మెంట్లు మీకు నిశ్చయంగా లభిస్తాయి !

ఈ విశేషమైన లక్షణముల వలన గెవా బాక్స్ సర్వోత్తమమైనది.

- దృఢమైన, చక్కటి బోడీ-పూర్తిగా ఉత్కృష్ఠమైన స్టీల్‌తో తయారు చేయబడినది.
- సరియైన కాంపోజిషన్, శీఘ్రంగా, సులభమైన ఫోటోగ్రాఫ్‌ల కొరకు, ఉజ్వలమైన, స్పష్టమగు, అయ్-లెవెల్ వ్యూ ఫైండర్.
- 3 స్పీడ్స్ (బల్బ్, 1/50 వ మరియు 1/100 వ సెకండ్లు) ఖచ్చితమగు, ఫాస్ట్-ఏక్షన్ షాట్స్ తీసుకోండి.
- దూరపు వస్తువులకు ఫోకస్ చేసుకునేందుకు (f 11 మరియు f 16) 2 ఎపర్చెర్లు

గెవా బాక్స్‌ను వాడడం ఎంతో సులభం కూడా, ఒక సారి క్లిక్ చెయ్యండి - మీ గెవా బాక్స్ మిగిలినదంతా చేస్తుంది.
మీ ఎపి ఎల్ వర్తకునీ చూపించమని అడగండి. ఖరీదు: రూ. 44.00




గెవార్ట్
# గెవాబాక్స్



ఎల్లయిడ్ ఫోటోగ్రాఫిక్స్ లిమిటెడ్, కస్తూరి బిల్డింగ్, జమ్‌షెడ్జీ టాటా రోడ్, బొంబాయి.

Bensons/I-APL-I.TL




నిర్మాతలు....పాతూరి సుబ్బారావు ప్రొడ్యూసర్.....P. సత్యనారాయణ

దర్శకత్వం.....ఎ.పి.నాగరాజన్.. పాటలు-మాటలు.....శ్రీశ్రీ.. సంగీతం....పామర్తి..

# చిన్న వయస్సులో నేర్చుకొనుటకు వున్నది ఒకదారి!








## కృష్ణా మిఠాయిలు

కిండర్ గార్డన్ పిల్లలకై ప్రత్యేకముగా తయారు చేయబడినవి.

కృష్ణా మిఠాయిలు, హ్లాదమును ఆశ్చర్యము కలుగచేయు విధమున వెలువడుచున్నది. పసిపిల్లలు, బాల బాలికలు, ఇంగ్లీషు సులభతరముగను, రుచికరముగను నేర్చుకొందురనుట స్వాభావికము.




**కె.సి.పి. లిమిటెడ్**
ఉయ్యూరు & మద్రాసు

Criterion-KCP-915-TE



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

మన దేశంలో ఇప్పటికింకా దాన ధర్మాలకు చాలా ఆదరణ ఉన్నది. దానధర్మాలు చేసేవారు సామాన్యంగా పనికిమాలినవారికే దానాలు చేస్తారు. నిజంగా పాత్రులైనవారికి కావలిసినది ప్రోత్సాహం, దానం కాదు. సామర్థ్యం గలవారందరూ కృషి చేస్తేనేగాని సమాజం పైకిరాని ఈ కాలంలో అర్హులకు ప్రోత్సాహం లభించటం చాలా అవసరం. ఈ నీతిని "లక్ష్మీకటాక్షం" [బేతాళ కథ] స్పష్టం చేస్తున్నది.

సంపుటి : 39 ఆగష్టు '66 సంచిక : 2

CHITRA



# భారత చరిత్ర



1747 లో నాదిర్‌షా హత్యచేయబడ్డాడు. అతని సేనాపతులలో ఒకడైన అహ్మద్‌షా అబ్దాలీ అనేవాడు అఫ్ఘానిస్తానుకు స్వతంత్ర పరిపాలకుడయాడు. ఇతను నాదిర్‌షా వెంట ఇండియాకు వచ్చి, మొగలు సామ్రాజ్యం ఎలాటి హీనస్థితిలో ఉన్నదో కళ్ళారా చూసి ఉన్నాడు. అందుచేత అతను అఫ్ఘాను రాజుగా కాస్త కాలు నిలవదొక్కుకోగానే భారతదేశం పైకి దాడి వచ్చి, 1748-1767 మధ్యకాలంలో అనేక దండయాత్రలు జరిపాడు.

ఇవి కేవలమూ కొల్లగొట్టడం కోసం జరిగిన దండయాత్రలు కావు, భారతదేశంలో మొగలుల అధికారాన్ని తుడిచిపెట్టేసి, అఫ్ఘానుల ఆధిపత్యాన్ని తిరిగి ప్రతిష్ఠ చేయాలనే ధోరణి ఈ దండయాత్రల వెనక ఉన్నది. ఈ ప్రయత్నానికి భారతచరిత్రలో ఎంతో ప్రాముఖ్యం కూడా ఉన్నది. అహ్మద్‌షా మరొకందుకు కూడా దాడులు తలపెట్టాడు: దేశాంతరాలలో విజయాలు సాధించటంచేత స్వదేశంలో అతని ప్రతిష్ఠ మరింత బలపడుతుంది; భారతదేశాన్ని కొల్లగొట్టిన డబ్బుతో తన సైన్యానికి జీతాలూ, సేనాపతులకు బహుమానాలూ ఇవ్వవచ్చు.

1748 లో అహ్మద్‌షా పంజాబుపై చేసిన తొలి దండయాత్ర అచ్చిరాలేదు. పంజాబు గవర్నరు అతన్ని ఓడించి పంపాడు. కాని మరి రెండేళ్ళ అనంతరం అహ్మద్‌షా పంజాబుపై రెండవ దాడి చేసి గెలిచాడు. పంజాబు గవర్నరుకు ఢిల్లీ నుంచి ఎలాటి సహాయమూ అందలేదు. 1751 చివరలో అహ్మద్‌షా భారతదేశం పై మరొక దండయాత్ర చేసి, కాశ్మీరును జయించి, సిర్‌హింద్ వరకూ గల మొగలుసామ్రాజ్యపు పశ్చిమ ప్రాంతాన్ని మొగలు చక్రవర్తి నుంచి గుంజుకున్నాడు.

## 59. అఫ్ఘాను దండయాత్రలు



అయితే 1756 లో పంజాబు రాష్ట్రంలో అరాజకపరిస్థితి ఏర్పడి, మొగలు ప్రధాని అయిన ఇమాదుల్ ముల్క్ అనేవాడి అధీనం లోకి వచ్చేసింది. అహ్మద్‌షా అబ్దాలీ ఆ ఏడు నవంబరులో నాలుగోసారి దండయాత్ర చేసి, 1757 జనవరి 23 నాటికి ఢిల్లీ చేరుకుని, ఆ నగరాన్ని కొల్లగొట్టాడు. మొగలు చక్రవర్తి (రెండవ ఆలంగీర్) అబ్దాలీకి పంజాబు, కాశ్మీరు, సింధు, సిర్‌హింద్ జిల్లాలు అర్పించుకుని రాజీపడ్డాడు. అబ్దాలీ 1757 ఏప్రిలులో స్వదేశానికి తిరిగి వెళ్ళాడు.

1757 మే లగాయతు 1758 ఏప్రిలు దాకా అబ్దాలీ కొడుకు తీమూర్‌షా అనేవాడు లాహోరులో వైస్రాయిగా ఉన్నాడు. అతని పరిపాలనలో అరాజకత్వం పెచ్చుమీరింది. సిక్కు నాయకుడికి ఒకడికి అత్యాచారం జరిగే సరికి సిక్కులు ఒక్కుమ్మడిగా అంతటా తిరుగుబాటు చేశారు. జలందరు పరగణాకు గవర్నరుగా ఉండిన ఆదీన బేగ్ ఖాన్ అనేవాడు అఫ్ఘానుల పై తిరగబడి మహారాష్ట్రులను సాయం పిలిచాడు. రఘునాథరావు నాయకత్వాన పెద్ద మరాఠీ సేన 1758 ఏప్రిలులో పంజాబుపై దాడి చేసి, లాహోరు ఆక్రమించి, అఫ్ఘానులను వెళ్ళగొట్టింది. అయితే మరాఠీ సేనలు లాహోరును ఆరు మాసాలు మాత్రమే తమ

అధీనంలో ఉంచుకున్నాయి. 1759 అక్టోబరులో అబ్దాలీ అయిదోసారి భారతదేశం పై దండయాత్ర చేసి, పంజాబును చివరకు స్వాధీనం చేసుకున్నాడు.

భారతదేశం పై ఆధిపత్యం కొరకు అఫ్ఘానులకూ, మరాఠీలకూ మధ్య ఘర్షణ క్రమంగా తీవ్రదశకువచ్చి, 1761 జనవరి 14 న పానిపట్టువద్ద ఉభయపక్షాలకూ యుద్ధం జరిగింది. 1762 లో అబ్దాలీ తిరిగి వెళ్ళాడు. తరవాత సిక్కులు విజృంభించి లాహోరు గవర్నరును హత్యచేశారు. అందు చేత అబ్దాలీ 1764 మార్చిలో లాహోరు వచ్చి, రెండు వారాలపాటు మాత్రమే ఉండి, స్వదేశంలో పరిస్థితులు విషమించగా తిరిగి పోయాడు. అతను 1767 లో సిక్కులను అణచటానికి మళ్ళీ ఒకసారి వచ్చాడు, కాని అతను విఫలుడయాడు. పంజాబులో లాహోరూ, మరి కొన్ని జిల్లాలూ, సిక్కుల అధీనంలోకి వచ్చాయి.

భారత చరిత్రలో అబ్దాలీ దండయాత్రల ప్రాముఖ్యం ఏమిటి? వాటి ప్రభావం చాలా ఉన్నది. అవి మొగలుసామ్రాజ్య విచ్ఛిత్తిని మరింత చురుకుగా కొనసాగించాయి; మరాఠీ సామ్రాజ్య విస్తరణకు అవి అడ్డు పడ్డాయి; సిక్కుల శక్తులను పరోక్షంగా పెంచాయి; అఫ్ఘాను దండయాత్రల వల్ల ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీవారు చాలా భయోత్పాతం చెందారు; అబ్దాలీ మరణించిన అనంతరంకూడా వారికా బెదురు కొంత కాలం పోనేలేదు.

ఢిల్లీ కేంద్రం దుర్బల మవుతున్నకొద్దీ, సామ్రాజ్యంలోని వివిధ రాష్ట్రాలలోని రాజ ప్రతినిధులు లాంఛనప్రాయంగా తాము ఢిల్లీ చక్రవర్తికి లోబడి ఉన్నట్టు చెప్పుకుంటున్నా వాస్తవానికి స్వతంత్రులుగా వ్యవహరించసాగారు. ఈ విధంగా సామ్రాజ్యంలో అనేక కొత్త ముస్లిము సంస్థానాలు వెలిశాయి.



# నేహ్రూ కథ

## 26



మర్నాడే సైమన్ కమిషను వచ్చేరోజు— బ్రహ్మాండమైన వ్యతిరేక ప్రదర్శన జరగ నున్న రోజు. ఈ రోజు జరిగిన లాఠీచార్జి గురించి పత్రికలో చదివి, అలహాబాదులో ఉన్న తన తండ్రి కంగారుపడి పోతాడేమో నని, జవాహరు ఆయనకు టెలిఫోనులో తాను బాగానే ఉన్నాననీ, తన తండ్రి ఏమాత్రమూ దిగులుపడ నవసరం లేదనీ చెప్పాడు. కాని మోతీలాలు దిగులు పడనే పడ్డాడు. ఆయన అర్ధరాత్రి వేళ కారులో బయలుదేరి, 146 మైళ్ళు ప్రయాణం చేసి, 5 గంటల కల్లా లక్నో చేరుకున్నాడు.

మోతీలాలు చేరే సమయానికి జవాహరు మొదలైన వాళ్ళు రైలుస్టేషనుకు ఊరేగింపు వెళ్ళటానికి సిద్ధమవుతున్నారు. క్రితం రోజు జరిగిన సంఘటనలతో ఉత్తేజితులై లక్నో పౌరులు సూర్యోదయం కాక పూర్వమే గుంపులు గుంపులుగా వీధులలో గుమి కూడారు. అన్ని ప్రాంతాల నుంచీ చిన్న చిన్న ఊరేగింపులు బయలుదేరాయి. కాంగ్రెసు ఆఫీసు నుంచి పెద్ద ఊరేగింపు బయలుదేరింది. ఈ ఊరేగింపులో వరసకు నలుగురేసి చొప్పున ఉన్నారు. ఇందులోనే జవాహరు కూడా ఉన్నాడు.

రైలుస్టేషను కెదురుగా, అరమైలు నిడివీ, అరమైలు వెడల్పూ గల పెద్ద మైదానం ఉండేది. పోలీసులు ఊరేగింపును అటకాయించి, ఈ మైదానంలో ఒక పక్కగా నిలబెట్టారు. మైదానం నిండా మామూలు పోలీసులూ, సైనికులూ, అశ్వికపోలీసులూ ఉన్నారు. చూడవచ్చిన గుంపులో నుంచి కొందరు మైదానంలోకి కూడా వచ్చారు. ఆ గుంపు అంతకంతకూ పెరిగిపోతున్నది.

ఇంతలో అకస్మాత్తుగా రెండుమూడు బారుల అశ్వికపోలీసులు ఎడా పెడా



అందిన వాళ్ళను కొట్టుతూ, అడ్డం వచ్చిన వాళ్ళను గుర్రాల కాళ్ళ కింద తొక్కుతూ అతివేగంగా ఊరేగింపు వాళ్ళ పైకి వచ్చారు. క్షణంలో మైదానం యుద్ధరంగంలా అయిపోయింది. కొందరు గుర్రాల కింద పడి నలిగి, తిరిగి లేవలేక బాధతో కొట్టుకోసాగారు. పోలీసుల గుర్రాలు అంత వేగంతో తమ పైకి వచ్చినా ఊరేగింపు వాళ్ళు చలించకుండా నిలబడ్డారు. తీరా మీదికి వచ్చాక గుర్రాలు వెనక కాళ్ళ పైన లేచి, ముందుకాళ్ళను వాలంటీర్ల తలల పైగా ఆడించాయి. తరవాత పోలీసులు, వాలంటీర్లను లాఠీలతో బాదనారంభించారు.



తాను ఉన్న చోటి నుంచి కదలరా దన్న ఆలోచన తప్ప జవాహరు కింకేమీ తెలియదు. దెబ్బల బాధతో అతనికి కళ్ళు సరిగా కనిపించలేదు. ఒక అస్పష్టమైన ఆగ్రహమూ, తిరిగి దెబ్బ తీయాలన్న ప్రేరణా అతనిలో తలఎత్తాయి. తన ఎదురుగా ఉన్న పోలీసు అధికారిని గుర్రం మీది నుంచి కిందికి ఈడ్చి, తానే దాని పైన ఎక్కటం ఎంతో తేలిక అనిపించింది. కాని క్రమశిక్షణ అతని చేతులను కట్టేసింది. కాంగ్రెసువాళ్ళు ఎదురుదెబ్బ తీసే పక్షంలో కాల్పులూ, అధిక సంఖ్యాకుల హత్యా జరిగి తీరుతుందని అతనికి తెలుసును.

లాఠీచార్జి మూలంగా వాలంటీర్ల శ్రేణి చెదిరిపోకుండానే పక్కకు జరగసాగింది. దానితో జవాహరు పోలీసులకు మరింత అందుబాటు లోకి వచ్చాడు. వాళ్ళు అతన్ని పనిపెట్టుకుని కొట్టుతున్నారన్న భావం కలిగి అతని మిత్రులు కొందరు ముందుకు వచ్చి, అతన్ని అమాంతంగా ఎత్తి అవతలికి తీసుకుపోయారు.

ఊరేగింపు చేస్తున్న వాలంటీర్లు నూరు అడుగులు వెనకగా మళ్ళీ బారులు తీరారు. పోలీసులు వెనక్కు తగ్గి వాళ్ళకు 50 అడుగుల దూరంలో తాము కూడా బారుగా





నిలబడ్డారు. ఈ లోపుగా సైమన్‌కమిషను సభ్యులు, అరమైలు దూరాన ఉన్న స్టేషను నుంచి చల్లగా బయటికి జారుకున్నారు. అయినా వారికి నల్ల జెండాలూ, ప్రదర్శనలూ తప్పలేదు. తరవాత ఊరేగింపు కాంగ్రెసు ఆఫీసుకు తిరిగి వెళ్ళింది. జవాహరు తండ్రిని చూడబోయాడు.

అడావుడంతా అణగారిపోయాక జవాహరుకు దెబ్బల బాధ తెలిసివచ్చింది. అతని శరీరంలో ప్రతి భాగమూ నొచ్చుతున్నది. అదృష్టవశాన మర్మస్థానాలలో ఎక్కడా అతనికి దెబ్బలు తగలలేదు. అతని పక్కనే ఉన్న గోవిందవల్లభపంతుది భారీ విగ్రహం. అతనికి చాలా దారుణంగా లాఠీ దెబ్బలు తగిలాయి. వాటితో ఆయన చాలా కాలం తీసుకున్నాడు.

జవాహరుకు కలకాలం మనసులో నిలిచిపోయినది పోలీసులు లాఠీచార్జి చేసేటప్పుడు వారి ముఖాలు. తీవ్రమైన దెబ్బలు కొట్టిన వాళ్ళు భారతీయ పోలీసులు కారు, యూరపియను సార్జెంట్లు; వారి ముఖాలు క్రౌర్యంతోనూ, ద్వేషంతోనూ, రక్తదాహంతోనూ, ఉన్మాదంతోనూ వికారంగా ఉండటం జవాహరు గమనించాడు. దెబ్బలు తిన్నవారి ముఖాలు కూడా పోలీసులకు వికారంగానే కనిపించి ఉండా లంటాడు



జవాహరు. వారు ప్రతీకారచర్య లేవీ చెయ్యని మాట నిజమేగాని, వారి మనస్సులలో ద్వేషాగ్ని లేకపోలేదు. అయితే ఉభయ పక్షాల మధ్య ప్రత్యేక శత్రుత్వం ఏమీ లేదు. ఆ సమయంలో ఒక అదృశ్య శక్తి కాంగ్రెసు వాలంటీర్లను ఆవహించి, వారి చేత ఒక విధంగా ప్రవర్తింప జేయించింది. "ఇదంతా ఏమిటి? దీనికి పర్యవసాన మేమిటి?" అన్న ప్రశ్నలు అప్పుడు కలగ లేదు; అవి తరవాత పుట్టుకొచ్చాయి.

1928 అంతా జవాహరు దేశసంచారం లోనూ, ఉపన్యాసా లివ్వటం లోనూ గడి పాడు. అతను ముఖ్యంగా సంపూర్ణ స్వాతంత్ర్యాన్నీ, సోషలిస్టు భావాలనూ ప్రచారం చేశాడు; సంపూర్ణ స్వాతంత్ర్యం లేనిదే సాంఘిక స్వాతంత్ర్యం సాధ్యం కాదని ప్రబోధించాడు. ఇలాటి ప్రచారమూ, ప్రబోధమూ కాంగ్రెసు కార్యకర్తలకు చాలా అవసరమని అతనికి తోచింది. జాతీయోద్య మానికి వెన్నెముక లాటి కాంగ్రెసు కార్య కర్తలు సంకుచిత జాతీయవాదం అవలం బించటమూ, ఎంతసేపూ వెనుకకే చూస్తూ, ఒకనాటి భారతీయ సంస్కృతి పరాధీనత వల్ల పతన మయిందని విచారించటమూ అతను గమనించాడు. జాతీయోద్యమంలో పనిచేసేవాళ్ళు భవిష్యత్తు గురించి ఆలో చించాలని అతని ఉద్దేశం.

జవాహరుకు ముందు సోషలిస్టులు దేశంలో లేకపోలేదు. సోషలిస్టు భావాలు అదివరకే దేశంలో వ్యాప్తమై ఉన్నాయి. అయితే సోవియట్‌యూనియను అభివృద్ధి సాధించి పంచవర్ష ప్రణాళికలు ప్రారంభిం చాక ఈ భావాలకు యూరపు లోనూ, అమెరికా లోనూ లాగే మన దేశంలో కూడా పరపతి హెచ్చింది. సోషలిస్టుగా జవాహరుకు గణుతి రావటానికి అతిముఖ్యమైన కారణ మేమంటే, అతను కాంగ్రెసు అగ్రనాయక శ్రేణిలోవాడు కావటమే.





# పాతాళదుర్గం

## 4

[రాత్రివేళ కదంబరాజనగరులో ఒక మహాకాయుడు ప్రవేశించి, రాజకుమార్తె కాంతిసేనను అపహరించి, ఎత్తుకుపోసాగాడు. కావలివాళ్ళు అతడి మీదికి బాణాలూ, ఈటెలూ విసిరారు. రాజు ఉగ్రసేనుడు అజ్ఞాపింపగా కొందరు అశ్వికులు అతడి వెంట బడ్డారు, మరికొందరు అతడి మీద అగ్నిబాణాలు ప్రయోగించసాగారు. తరవాత—]

రాజప్రాసాదంలో రేగిన గగ్గోలుకు నగరమంతా మేల్కొన్నది. ప్రజల్లో చాలామంది శత్రురాజెవడో నగరం మీద దాడి కొచ్చాడని భయపడ్డారు. వాళ్ళల్లో కొందరు నగర ద్వారాల కేసి పరిగెత్తారు.

ఇంతలో భటులు వదిలిన అగ్నిబాణాలు కొన్ని గురితప్పి నగరం లోని ఇళ్ళ మీద పడినై. ఆ వెంటనే అక్కడా యిక్కడా చిన్నచిన్న మంటలు లేచినై. ప్రజల్లో భీతాహం పుట్టింది. వాళ్ళు తమ తమ గృహాలు రక్షించుకునేందుకు వెనుదిరిగి పరిగెత్తసాగారు.

మేడ పైభాగాన నిలబడి ఇదంతా చూస్తున్న రాజు ఉగ్రసేనుడు మంత్రి కేసి తిరిగి, "అమాత్యా, యిదీ మన ప్రజల రాజభక్తి! కష్టకాలంలో ఎవడి క్షేమం వాడు చూసుకునేవాడే తప్ప, మన రక్షణకై వచ్చి నిలబడేవా డొక్కడూ లేడు. నిజంగా శత్రు



రాజే దాడికి వస్తే, కోట రక్షణకు సహాయపడేవాడు వీళ్ళల్లో ఒక్కగా నొక్కడైనా ఉండడు," అన్నాడు కోపంగా.

"మహారాజా, రాజ్యరక్షణకు మనం జీతభత్యా లిచ్చి పోషిస్తున్న సైనికులున్నారు గదా, యీ పిరికి ప్రజ వల్ల అయ్యే దేమిటి? వాళ్ళ చావు వాళ్ళని చావనివ్వండి," అంటూ మంత్రి అగ్నిబాణాలు ప్రయోగిస్తున్న భటులను రాజుకు చూపుతూ, "మనవాళ్ళు రాక్షసుడి మీద ప్రయోగించే బాణాలూ, ఈటెలూ రాజకుమార్తెకు హాని కలిగించ వచ్చు. ఆ విషయమై భటులను హెచ్చరించటం అవసరం గదా," అన్నాడు.



ఉగ్రసేనుడు "అవునవును!" అంటూ తలవూపి, తొందరతొందరగా భవనం మీది నుంచి కిందికి దిగిపోతూ, "అమాత్యా! నేను తిరిగి వచ్చేవరకూ నగరరక్షణ బాధ్యత మీరే వహించాలి. శతభానుడు దేనికైనా సమర్థుడు. మనం అతడి దగ్గిరకు పంపిన దూత లేమయారో తెలియటం లేదు," అన్నాడు. అంతలో ఒక సేవకుడు గుర్రాన్నొకదాన్ని మెట్ల వద్దకు తెచ్చి నిలబెట్టాడు. ఉగ్రసేనుడు ఒక్క ఎగురున దాన్ని అధిరోహించి, కొందరు రౌతులు వెంట రాగా, నగరద్వారం దాటి అరణ్యమార్గం పట్టాడు. మంత్రి కొంచెం సేపు రాజు పోయిన వైపుకే చూస్తూ నిలబడి, తరవాత కోట బురుజు కేసి నడుస్తూ, "ఈ ఉగ్రసేనుడు రాజ్యాన్ని మరెంతో కాలం నిలబెట్టుకోలేడు," అనుకున్నాడు.

కదంబనగరానికి తూర్పుదిక్కున వున్న అరణ్యం, కొండప్రాంత మంతా కాగడాలూ, దివిటీలూ పట్టుకు తిరుగుతున్న సైనికులతో నిండిపోయింది. "దివిటీల వెలుగులో తనను వెతికేవాళ్ళను రాక్షసుడు తేలిగ్గా గుర్తిస్తాడు. అలాంటప్పుడు వాడు వీళ్ళ కెలా దొరుకుతాడు!" అనుకుంటూ మంత్రి ఆశ్చర్యపోయాడు.





అరణ్యంలో ధూమకసోమకుల కూడా యిలాంటి అనుమానమే కలిగి, కదంబ రాజు తెలివితక్కువ తనానికి నవ్వుకున్నారు. వాళ్ళిద్దరూ, సైనికులు తామున్న ప్రాంతానికి రాగానే, గుర్రాలు దిగి, వాటిని గుబురు చెట్ల చాటున దాచి, ఒక పెద్ద చెట్టెక్కి కొమ్మల్లో దాక్కున్నారు. కదంబ సైనికుల్లో కొందరు కాగడాలు పట్టుకుని, ఆ చెట్టు కిందికి వచ్చి, సంభాషించుకో సాగారు. వాళ్ళ మాటల వల్ల ధూమక సోమకులకు రాజకుమార్తె అపహరణా, ఉగ్రసేనుడు స్వయంగా అరణ్యంలోకి వచ్చిన సంగతీ తెలిసింది.

"ఆ దుర్మార్గుణ్ణి చంపటానికి మన కిది మంచి అవకాశం," అన్నాడు సోమకుడు.

"తొందరపడకు సోమూ! మనం సైనికుల దుస్తుల్లో వున్నట్టయితే, ఆ పని సాధ్యమయేది. ఇప్పుడు మన మున్న వేషంలో, ఎవరి కంటనైనా పడ్డామో, ముందు మనం చావటం ఖాయం," అన్నాడు ధూమకుడు. కదంబ సైనికులు చెట్టు కింది నుంచి వెళ్ళిపోయారు.

"సోమూ, ఇక మనం చెట్టు దిగి, యింకా చీకటి వుండగానే మన గ్రామం చేరటం మంచిది. మన కుటుంబాలను యీ రాజ్య సరిహద్దులు దాటించందే, మనం ఎలాంటి సాహసానికీ పూనుకోగూడదు," అన్నాడు ధూమకుడు. సోమకు డేమీ జవాబివ్వలేదు. ఇద్దరూ చెట్టుకొమ్మల్లోంచి కిందికి రాసాగారు. అంతలో కొంచెం ఎడంగా వున్న ఊడలమర్రి చాటు నుంచి నల్లని భయంకరాకారం ఒకటి బయటికి వచ్చి దాపుల నున్న కొండగుహల కేసి నడవసాగింది. దాని భుజం మీద ఒక మానవాకృతి నిశ్చేతనంగా పడివున్నది.

ధూమకుడు, సోమకుడి భుజం పట్టుకుని ఆగమని హెచ్చరించి, గుహల కేసి పోతున్న భయంకరాకారాన్ని అతడికి





గుహ నుంచి బయటికి వచ్చి, కిక్కురు మనకుండా వెళ్ళిపో," అన్నాడు రాక్షసుడు.

"నువ్వెవడో రాక్షసుడిలా కనిపిస్తున్నావ్? నే నిక్కడ ఒక మహావీరుడికి మూలికా వైద్యం చేసి గాయాలు మాన్పి, ఇప్పుడే స్పృహ తెప్పించాను. వీరాలు పలక్కుండా గుహ ముందు నుంచి కదిలి, కిమ్మనకుండా నీ దారిన పో!" అన్న జవాబు వచ్చింది గుహలో నుంచి.

ఆ జవాబు వింటూనే రాక్షసుడు ఉగ్రుడై పోయి, "ఒరే, మనిషీ! ఎంతమాటన్నావ్? నేను రాక్షసుణ్ణిరా, కుంభీరుణ్ణి!" అంటూ హుంకరించి గుహ కేసి ఒకడుగు వేశాడు.

"నేను మాంత్రికుణ్ణిరా, కాలశంబరుణ్ణి! కాచుకో!" అంటూ గుహ నుంచి కేక విన బడింది. ఆ వెంటనే మెరుస్తున్న శంబరుడి మంత్రదండం పాములా బుసకొడుతూ వచ్చి, కుంభీరుడి తలను బలంగా తాకింది.

అంత బలశాలి అయిన కుంభీరుడూ, మంత్రదండం దెబ్బ తింటూనే కింద పడి పోయాడు. కాని ఆ పడేటప్పుడు రాజ కుమారి కాంతిసేనకు అపాయం కల క్కుండా జాగ్రత్త పడ్డాడు. కాంతిసేన అప్పుడే నిద్ర నుంచి మేల్కొన్నట్టు కళ్ళు తెరిచి చుట్టూ కలయ చూసింది. ఆమె

చూపుతూ, "అడుగో రాక్షసుడు! వాడి భుజం మీద వున్నది రాజకుమార్తే, అను మానం లేదు. ఆమె ధరించిన వజ్రవైడూ ర్యాలు, ఈ గుడ్డివెన్నెల్లో కూడా ఎలా మిలమిలా మెరిసిపోతున్నవో, చూశావా!" అన్నాడు. సోమకుడు ఆ దృశ్యం చూస్తూనే నిశ్చేష్టుడైపోయాడు. రాక్షసుడు గుహల్లో ఒకదాన్ని సమీపించే సరికి, లోపలి నుంచి, "ఎవరు వాళ్ళు? వెనక్కు తిరిగి పొండి!" అన్న గంభీర కంఠస్వరం వినబడింది.

"ఒరే మనిషీ, గొంతు పగిలేలా అంత పెద్దగా అరవకు! నే నీ రాత్రి ఎవణ్ణీ చంప కూడదని ఒట్టేసుకున్నాను. మర్యాదగా





ఎత్తుగా పెరిగి తివాసీలా ఉన్న పచ్చిగడ్డిపై పడుకుని వున్నది. పక్కనే తనను అపహరించుకు వచ్చిన మహాకాయుడు తల చేతులతో పట్టుకుని మూలుగుతూ, మధ్య మధ్య పళ్ళు కొరుకుతున్నాడు. అతడి తల మీద వున్న కొమ్ముల్లో ఒకటి— కుడివైపుది మంత్రదండం దెబ్బకు విరిగి పోయింది. అక్కడ కలిగిన గాయం నుంచి సంతతధారగా రక్తం కారుతున్నది.

మహా భయంకరుడైన ఆ రాకసుణ్ణి, ఆ దీనస్థితిలో చూడగానే కాంతిసేనకు అతడంటే భయం పోయి, ఎంతో జాలి కలిగింది. ఆమె చప్పున లేచి కూర్చుంటూ,



"ఓ మహారాక్షసా! నన్ను తినదలుచుకున్న వాడివి, ఇంత దూరం ఎందుకు తెచ్చావు? నిన్ను గాయపరిచిందెవరు? మా తండ్రిగారేనా? ఆయన గొప్ప శూరుడు, శరణన్న వాళ్ళను వధించడు. ఆయన్ని బతిమాలి నీకు ప్రాణదానం చేయిస్తాను," అన్నది.

రాజకుమారి మాటలు వింటూనే కుంభీరుడికి అంత బాధలోనూ నవ్వాగింది కాదు. అతడికి ఆమె మాట్లాడిన తీరు కూడా ఎంతో ముచ్చట కలిగించింది.

కుంభీరుడు కూర్చున్న చోటు నుంచి లేచి కొద్ది దూరంలో వున్న పొదల దగ్గరకు వెళ్ళి వాటి ఆకులు కోసి అరచేతుల్తో వాటిని బాగా మర్దించి, తల మీద నెత్తురు కారుతున్న చోట ఆ పసరు పూసుకుని తిరిగి కాంతిసేన దగ్గరకు వచ్చాడు. అతడు వచ్చేసరికి కాంతిసేన గుహ కేసి చూస్తున్నది.

"ఆ చీకటి గుహలో ఎవరో మాట్లాడుతున్నారు. వాళ్ళెవరు మహారాక్షసా? నీ అనుచరులా?" అని అడిగింది ఆమె.

కుంభీరుడు గుహ కేసి రోషంగా చూసి, "అక్కడ వున్నది నా అనుచరులు కాదు, శత్రువులు. తల మీద యీ గాయం ఆ శత్రువు కలిగించిందే. వాడొక మాంత్రికుడు, శక్తిమంతుడిలా కనిపిస్తున్నాడు.



నే వచ్చిన పని చెడిపోయే ప్రమాదం ఉన్నది కనక, ప్రస్తుతానికి వాణ్ణి ప్రాణాలతో వదిలిపెడుతున్నాను," అన్నాడు.

"నీ వొచ్చిన పనేమిటి? నన్ను గృహం నుంచి దొంగలా ఎత్తుకుపోవటమా? ఎంత గొప్ప వీరుడివి, ఛీ!" అన్నది కాంతిసేన లేచి నిలబడుతూ.

కుంభీరుడా మాటలకు నిలువునా కంపించి పోయాడు. లజ్జతో ముఖం ముడుచుకుపోయింది. కళ్ళలో నీళ్ళు తిరిగాయి. అతడు కాంతిసేన ముందు చేతులుమోడ్చి మోకరిల్లుతూ, "అమ్మా, కాంతిసేనా! నన్నంతగా అసహ్యించుకోకు. నేను స్వతంత్రుణ్ణి కాను, ఒకానొక మహాశక్తిమంతుడికీ, క్రూరాతిక్రూరుడికీ భృత్యుణ్ణి. నిన్ను ఎత్తుకు రావలిసిందిగా ఆజ్ఞాపించినవాడు, ఆ మహాపాపి. ఆ పని నేను కాకపోతే, అతని భృత్యుల్లో మరొకడు—నా కన్న క్రూరాత్ముడూ, కఠినాత్ముడూ నెరవేర్చేవాడు. అతడి ఆజ్ఞకు తిరుగులేదు. కాని, నేను నిన్ను నా ప్రాణాలొడ్డి అయినా సరే కాపాడి, ఏదో ఒకనాడు నీ తండ్రి గృహానికి చేరుస్తాను," అన్నాడు.

"ఆ పని యిప్పుడే ఎందుకు చేయకూడదు?" అని ప్రశ్నించింది కాంతిసేన.




"అది మనిద్దరికీ ప్రాణగండం అయి తీరుతుంది. నిన్ను నా యజమాని తెమ్మన్న చోటుకు తీసుకుపోక తప్పదు. నువ్వేమీ భయపడకు. నిన్నతణ్ణుంచి నేను కాపాడి తీరుతాను. ఈ భూ ప్రపంచంలో నీ మనస్సుకు నచ్చిన వాడితో నీకు వివాహం జరిగేలా చూస్తాను, సరా," అన్నాడు కుంభీరుడు.

కాంతిసేనకు ఏం మాట్లాడేందుకూ పాలుపోలేదు. కుంభీరుడి మంచితనంలో ఆమెకు కొంత నమ్మకం కలిగినా, అతడు చెబుతున్న దేమిటో కొంచెం కూడా అర్థం కాలేదు. అప్పుడు తను చేయగలిగిందేమిటి?

పారిపోయే ప్రయత్నం చేయటం వృథా. రాక్షసుడి కన్ను గప్పటం సాధ్యమయేది కాదు. సహాయం కోసం కేకలు వేసే ప్రయోజనం లేదు. కుంభీరుడు ఉగ్రుడై తన గొంతు నులమవచ్చు. అతడితో మంచిగా వుంటూ సౌమ్యంగా ప్రవర్తించటమే తనకు భవిష్యత్తులో మేలు కూర్చుతుంది...

కాంతిసేన యిలా ఆలోచిస్తున్నంతలో గుహ ముందు కాగడా వెలుగు కనిపించింది. పెద్దపెద్ద జడలతో, ఆపాదమస్తకం కాషాయ వస్త్రాలతో, చేతిలో మంత్రదండం పట్టుకుని వున్న వికృతాకారు డొకడు ఆ వెలుగులో అక్కడ ప్రత్యక్షమయాడు.

"ఏం, రాక్షసాధమా! నువ్వింకా యిక్కడే తగలడ్డావా? జోరీగ లాగా చెవి పక్కన ఏమిటా రొద? నీలో నువ్వే మాట్లాడుకుంటున్నావా, లేక నీ అనుచరాధము డెవడైనా పక్కనున్నాడా?" అని ఈసడిస్తూ ప్రశ్నించాడు మాంత్రికుడు.

కాంతిసేన మాంత్రికుడికి కనబడకుండా కుంభీరుడు ఆమెకు అడ్డంగా నిలబడి, కళ్ళెర్రజేసి, పళ్ళు కొరుకుతూ, "మానవాధమా! నే నీ రాత్రి ఎవర్నీ చంపకూడదని ఒట్టు పెట్టుకున్నాను. అయినా, నిన్నిప్పుడు ప్రాణాలతో వదలను!" అంటూ హుంకరించి ముందుకు అడుగు వేశాడు.

మాంత్రికుడు వికటాట్టహాసం చేస్తూ, మంత్రదండం ఎత్తి, "అహాఁ, రాక్షసపురుక్కెంత కోపం వచ్చింది!" అంటూ దాన్ని విసరబోయేంతలో, రివ్వుమంటూ ఒక బాణం వచ్చి, అతడి చేతిని తాకింది. ఆ వెంటనే చెట్ల మీది నుంచి కేకలు వినబడినై. మాంత్రికుడు చేతిలోని కాగడాను విసిరి నేలకు కొట్టి, గుహ లోపలికి వెళ్ళాడు. కుంభీరుడు చప్పున కాంతిసేనను భుజాని కెత్తుకుని మరో గుహ కేసి పరిగెత్తసాగాడు. ఈ లోపల రివ్వురివ్వు మంటూ బాణాలు వచ్చి పడసాగినై. —(ఇంకావుంది)





# లక్ష్మీకటాక్షం

విసుగు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, కార్యసిద్ధి కావటానికి శ్రమ మాత్రమే చాలదు, దైవం కూడా అనుకూలించాలి. నీకు దైవం అనుకూలించని కారణం చేతనే, లక్షపురం లోని కార్పటికుడి లాగా ఎంత శ్రమపడి కూడా ఫలితం పొందలేకుండా ఉన్నావు. శ్రమ తెలియకుండా నీకా కథ చెబుతాను, విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

లక్షపురాన్ని ఏలే లక్షదత్తుడు గొప్ప దాత. ఆయన యాచకుడికి లక్షకు తక్కువ ఇచ్చి ఎరగడు, అందుకే ఆయనకు లక్షదత్తు డన్న పేరు వచ్చింది. ఆ మహారాజు ఎవడితోనైనా తృప్తిపడినట్టయితే వాడికిక మిగిలిన

## బేతాళ కథలు



జీవితకాలంలో ఎలాటి దారిద్ర్యమూ ఉండేది కాదు.

రాజుగారి ఇంటి సింహద్వారం వద్ద లబ్ధదత్తు డనే కార్పటికుడు అహోరాత్రాలు ఎండనక, వాననక పడిగాపులు కాస్తూ, రాజుకు నిత్యమూ కనిపించేవాడు. ఆ కార్పటికుడి దుస్థితి చూసి కూడా రాజు అతనికి ఎలాటి సహాయమూ చెయ్యలేదు.

ఒకనాడు రాజు సపరివారంగా వేటకు బయలుదేరాడు. రాజుగారి గుర్రం వెనుకగా, తన చేతికర్ర తీసుకుని కార్పటికుడు కూడా వెళ్ళాడు. రాజుగారు విల్లుబాణాలు తీసుకుని గుర్రం మీద ఉండి వన్యమృగాలను వేటాడుతుంటే, కార్పటికుడు నేల మీదనే ఉండి తన చేతికర్రతో అనేక అడవిపందులనూ, లేళ్ళనూ చంపాడు.

"నిర్భాగ్యుడైన ఈ కార్పటికు డెంత మంచి వేటగాడు!" అని రాజు ఆశ్చర్య పడ్డాడు. కాని అప్పటికీ అయన ఆ కార్పటికుడికి ఎలాటి సహాయమూ చెయ్యలేదు.

ఒకసారి లక్షదత్తుడు తన సరిహద్దున ఉన్న దాయాది పైకి యుద్ధానికి వెళ్ళాడు. కార్పటికుడు కూడా సేన వెంట వెళ్ళి, యుద్ధంలో శత్రువు లనేకమందిని తన చేతికర్రతో ఎడాపెడా చంపాడు. రాజు ఆ కార్పటికుడి శౌర్యపరాక్రమాలకు అమితాశ్చర్యం చెందాడు. కాని అప్పటికీ రాజు అతడి కేమీ ఇవ్వలేదు.

ఇలా అయిదు సంవత్సరాలు గడిచాయి. ఆరో సంవత్సరంలో రాజుకు ఒకనాడు ఈ విధంగా ఆలోచన వచ్చింది: "ఈ అభాగ్యుడు అయిదేళ్ళుగా నా ఎదట అష్టకష్టాలూ పడుతున్నప్పటికీ, వాడి కేమైనా సహాయం చెయ్యాలన్న ఆలోచన నాలో కలగనేలేదు. ఏ జన్మలోనో ఏదో పాపం చేసి వీ డిలాగయి ఉంటాడు. ఇప్పటికైనా వీడికి పాపక్షయం అయినదీ, లేనిదీ పరీక్షించి చూస్తాను."

ఇలా అనుకుని రాజు స్వయంగా తన భాండాగారానికి వెళ్ళి, కొన్ని రత్నాలు ఏరి ఒక మాదీఫలంలో ఉంచి, మర్నాడు మంత్రి సామంతులతో కూడి సభచేసే సమయంలో ద్వారం వద్ద పడిగాపులు కాసే కార్పటికుణ్ణి సైగచేసి పిలిచాడు. కార్పటికుడు సభ లోకి వచ్చి రాజు చూపిన ఆసనం మీద కూర్చున్నాడు.

అప్పుడు రాజు అతణ్ణి ఏదైనా సుభాషితం చెప్పమన్నాడు. "నీటితో నిండిన సముద్రుడికే నదులు తమ జలాలను అర్పిస్తాయి, డబ్బు కూడా ఉన్నవారి వద్దకే పోతుంది, లేనివారి చాయలకు పోదు," అనే అర్థం వచ్చే శ్లోకాన్ని చదివాడు కార్పటికుడు. రాజు పరమానంద భరితుడై, కార్పటికుడి చేతిలో మాదీఫలం పెట్టాడు. అది చూసి మంత్రిసామంతు లాశ్చర్యపడ్డారు. ఎందు చేతనంటే, ఎవరితోనైనా తృప్తి చెంది నప్పుడు రాజు వారిపై కనకవర్షం కురి పిస్తాడు. అలాటివాడు ఈ కార్పటికుణ్ణి చూసి ఎంతో సంతోషించి కూడా ఒక మాదీఫలం మాత్రమే చేతబెట్టాడు. చూసే వారి కది విడ్డూరంగా కనబడింది.

కార్పటికుడు మాత్రం ఆ మాదీఫలాన్ని తీసుకుని సంతోషించలేదు. అతను దాన్ని తీసుకుని వెళ్ళిపోతూ, రాజబంది అనే





భిక్షువు ఎదురుకావటం చూసి, రాజిచ్చిన ఫలాన్ని ఆ భిక్షువు చేత పెట్టాడు. భిక్షువు అతనికి తన వంటి మీది శాటీని ఇచ్చాడు. కార్పటికుడు ఆ శాటీని అమ్మి, భోజనం చేసి వచ్చి మళ్ళీ సింహద్వారాన్ని చేరాడు.

ఈ లోపల భిక్షువు రాజును చూసి, మాదీఫలాన్ని ఆ రాజుకు కానుక పెట్టాడు. రాజు దాన్ని గుర్తించి, "నీ కిది ఎలా వచ్చింది?" అని అడిగాడు. కార్పటికుడు దాన్ని తన కిచ్చినట్టు భిక్షువు చెప్పాడు. "వాడి పాపం ఇంకా పరిహారం కాలేదు కాబోలు," అనుకుని రాజు సభ చాలించి, పండుతో సహా ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

మర్నాడు మళ్ళీ సభ జరిగింది. రాజు కార్పటికుణ్ణి పిలిచి, తన సమీపంలో కూర్చోబెట్టుకుని, కిందటిరోజు చదివిన శ్లోకమే చదివించి, మెచ్చుకుని, మళ్ళీ ఆ మాదీఫలాన్నే అతని చేతిలో పెట్టాడు. కార్పటికుడా పండును పట్టుకుని బయటికి వెళ్ళిపోయి, రాజును చూడవచ్చే ఒక అధికారి ఎదురయే సరికి, అతనికి ఆ మాదీఫలాన్నిచ్చి, అతని నుంచి ధోవతుల చాపు పుచ్చుకున్నాడు.

ఆ అధికారి మాదీఫలాన్ని తెచ్చి రాజుకు కానుక పెట్టి, రాజు అడిగిన మీదట, దాన్ని తన కొక కార్పటికుడిచ్చినట్టు చెప్పాడు. "ఇంకా ఆ కార్పటికుడి పాపం పరిహారం కాలేదు కాబోలు," అనుకున్నాడు రాజు.

మూడోనాడు సభ జరిగేటప్పుడు రాజు మళ్ళీ కార్పటికుణ్ణి సభలోకి పిలిచి, ఆ పాత శ్లోకమే మరొకసారి చదివించి, తన సంతోషాన్ని వెలిబుచ్చి, మాదీఫలాన్ని మళ్ళీ చేతిలో పెట్టాడు. కార్పటికుడు దాన్ని తీసుకుపోయి, రాజాస్థానానికి వస్తున్న విలాసిని అనే నర్తకి కిచ్చి ఒక బంగారు కాసు బహుమానం పొంది వెళ్ళిపోయాడు. విలాసిని ఆ మాదీఫలాన్ని తిరిగి రాజుకే కానుకగా ఇచ్చింది. "లక్ష్మీదేవి యొక్క

శుభదృష్టి ఇంకా కార్పటికుడి పైన ప్రసరించకుండా ఉన్నది," అనుకున్నాడు రాజు.

నాలుగోరోజు సభలోకి కూడా రాజు కార్పటికుణ్ణి పిలిపించి, శ్లోకం చదివించి, ఆ మాదీఫలాన్నే ఇవ్వబోయాడు. కాని ప్రమాదవశాన, కార్పటికుడు దాన్ని తీసుకునే లోపుగా రాజు వదిలెయ్యటం చేత అది కిందపడి పగిలింది. దాని నుంచి ధగధగా మెరిసే రత్నాలు చుట్టూ చిమ్మేసరికి సభికులందరూ నిర్ఘాంతపోయారు.

అప్పుడు రాజు సభికులకు జరిగినదంతా చెప్పి, "ఈ కార్పటికుడు చేసుకున్న పాపం ఎప్పటికి తీరిపోతుందా అని నేను యిన్నాళ్ళుగా చూస్తున్నాను. ఇవాళతో అది తీరిపోయింది. లక్ష్మి ఇతన్ని నేడు కటాక్షించింది," అన్నాడు.

రాజు కార్పటికుడికి ఆ పండులోని రత్నాలు బహూకరించటమే గాక, అతని కొక చిన్న రాజ్యం కూడా ఇచ్చి, తనకు సామంతుణ్ణిగా చేసుకున్నాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, కార్పటికుడు ఏ పాపం చేసుకున్నందు వల్ల మహాదాత అయిన లక్షదత్తుడి నుంచి అయిదేళ్ళ పాటు ఎట్టి దానమూ పొందకపోయాడు? వరుసగా మూడురోజులు కార్పటికుడికి దర్శన మివ్వని లక్ష్మి ఏ కారణం చేత



నాలుగో రోజున దర్శన మిచ్చింది? ఈ సందే హానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కార్పటికుడు చేసుకున్న పాపమల్లా అతను యాచకుడు కాకపోవటమే. లక్షదత్తుల వంటి మహా దాతలు యాచించని వారికి ఏమీ ఇవ్వరు. కార్పటికుడు శక్తిసంపన్నుడు. అతను రాజాశ్రయం కోసం అయిదేళ్ళు ఓపికగా వేచి ఉన్నాడు. అతను చెయ్యిచాచి అడుగుతాడని రాజు కూడా వేచి ఉన్నాడు. ఈ మధ్యకాలంలో కార్పటికుడు ఒకసారి వేటలోనూ, మరొకసారి యుద్ధంలోనూ తన అసాధారణ ప్రతాపం చూపాడు. అయినా రాజు దృష్టిలో అతనింకా యాచకుడుగానే ఉండిపోయాడు. రాజును అంతరాత్మ వేధించ సాగింది. అయిదేళ్ళకు పైగా ఆ కార్పటికుడు తన సింహద్వారం వద్ద పడిగాపులు కాస్తున్నాడు. అందుచేత రాజు దానం చేయ నిశ్చయించాడు. కాని అడగని వాడి కెలా దానం చెయ్యటం? అందుచేత గుప్తదానం చేసి దానికి పరీక్ష అని ఒక పేరు పెట్టాడు. నిజంగా కార్పటికుడు ఏదో పాపం చేసుకున్న కారణంగానే అతనికి మాదీఫలం లోని మణులు దక్కకపోయిన పక్షంలో ఆ మాదీఫలాన్ని అతని నుంచి పుచ్చుకున్న ముగ్గురూ కూడా పాపులే అయి ఉండాలి. వాళ్ళు ఆ ఫలాన్ని తిరిగి రాజుకే ఇచ్చారు. చిట్టచివరకు కార్పటికుడికి లక్ష్మి ప్రసన్నం అయ్యే ఉపాయం కూడా రాజే చేశాడు; కార్పటికుడు అందుకునే లోపల ఫలాన్ని జారవిడిచి పగలగొట్టాడు. అందు చేత మొదటి నుంచీ తప్పు లక్షదత్తుడిదే గాని, లక్ష్మిదేవిదీ, కార్పటికు డెన్నడో చేసు కున్న పాపానిదీ కాదు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# రాజుకొడుకూ - మంత్రికొడుకూ

పుష్కరావతీ నగరాన్ని ఏలే గూఢసేనుడనే రాజుకు ఒకేఒక కొడుకుండేవాడు. అతనికి చిన్నతనం నుంచీ మంత్రికొడుకుతో గాఢమైన స్నేహం ఉండేది. ఇద్దరూ ఒకే వయసువాళ్ళు, ఒకే విధమైన రూపురేఖలు కలిగి ఉండేవాళ్ళు. వారి మధ్య స్నేహం ఎంతగా పెరిగిపోయిందంటే, వాళ్ళు ఒకరిని విడిచి ఒకరు క్షణం సేపు కూడా ఉండలేక పోయేవారు.

ఇలా కొంతకాలం గడిచాక రాజుకొడుకు పెళ్ళి అహిచ్ఛత్రంలో జరగటానికి నిశ్చయమయింది. రాజుకొడుకు మంత్రికొడుకును తనతోబాటు ఏనుగు పైన ఎక్కించుకుని, పరివారంతో సహా అహిచ్ఛత్రానికి బయలుదేరాడు. సాయంకాల మయేసరికి ఇక్షుమతీ నదీతీరానికి చేరుకుని అక్కడ మజిలీ చేశారు. అక్కడ భోజనా లయాక రాజు కొడుకు తన దాదిని ఏదైనా కథ చెప్పమని అడిగి, ఆమె కథ చెప్పుతూండగానే మార్గాయాసం చేత నిద్రపోయాడు. తరవాత దాది కూడా నిద్రపోయింది.

మంత్రికొడుకు మాత్రం నిద్రపోలేదు. అతనికి ఆకాశంలో ఎవరో మాట్లాడుకునే మాటలు వినిపించాయి. అతను వాటిని శ్రద్ధగా ఆలకించసాగాడు. ఆ మాట్లాడుతున్నది ఎవరో దేవతాస్త్రీలని అతనికి తోచింది. వారిలో ఒకతె, "ఈ పాపిష్టివాడు కథ పూర్తి కాకుండానే నిద్రపోయాడు. అందుచేత వీడికి ఈ శాపం ఇస్తున్నాను. ఈ హారాన్ని కింద పడేస్తున్నాను. వీడు తెల్లవారి లేచి దీన్ని తీసుకుని, వెంటనే చస్తాడు," అన్నది.

"అలా చావని పక్షంలో, నది దాపుల వున్న ఆ మామిడి చెట్టు పళ్ళను చూసి, ఆశపడి కోస్తాడు. కోసి ఆ వెంటనే చస్తాడు," అన్నది మరొకతె.

జి. హరినారాయణ

"అలా కూడా చావని పక్షంలో వీడు పెళ్ళివా రింట ప్రవేశించే క్షణంలోనే ఆ ఇంటి ముందుభాగం కూలి, మీద పడి చస్తాడు," అన్నది మూడోది.

"అలా కూడా చావు తప్పించుకున్నట్టయితే పడకటింట ప్రవేశించి నూరు తుమ్ములు తుమ్ముతాడు. వాడు తుమ్మినప్పుడల్లా ఎవరో ఒకరు 'చిరంజీవ' అనని పక్షంలో నిశ్చయంగా చస్తాడు," అన్నది నాలుగోది.

"ఈ మాటలు విన్నవా డెవడైనా వాడి ప్రాణాలు కాపాడాలని వాడితో ఈ సంగతి చెబితే వాడు కూడా చస్తాడు," అన్నది అయిదోది. ఆ తరవాత ఆ దేవతా స్త్రీలు ఆకాశమార్గాన వెళ్ళిపోయారు.

పిడుగుపాటు లాటి ఈ మాటలు విని మంత్రికొడుకు చాలా కలవరపడ్డాడు. రాజు కొడుకు చస్తే తను బతికి ఉండలేడు. అలా అని రాజుకొడుకుతో ఈ శాపాల మాట చెప్పి, అతనికి చావు తప్పించటానికి కూడా లేదు; అతని చావు అబద్ధమూ తన చావు నిజమూ అవుతుంది. అందుచేత తన మిత్రుడితో ఏమీ అనకుండానే తాను అతని ప్రాణాలు కాపాడాలని మంత్రికొడుకు నిశ్చయించుకున్నాడు. ఆ రాత్రి అతనికి కన్ను మూత పడనేలేదు.



తెల్లవారింది. అందరూ బయలుదేరారు. రాజుకొడుకుకు నేలమీద ఏదో హారం కన బడింది. అతను దాన్ని తీసుకోబోతూ ఉంటే మంత్రికొడుకు అడ్డుపడి, "దాన్ని తాకకు. అదేదో మాయాహారం లాగుంది. కాని పక్షంలో దాన్ని మన సైనికులలో ఎవడో ఒకడు చూసి, ఎప్పుడో తీసుకుని ఉండే వాడు," అన్నాడు. ప్రాణమిత్రుడి మాట తీసెయ్యక రాజుకొడుకు ఆ హారాన్ని వదిలేశాడు.

కొంచెం దూరం వెళ్ళేసరికల్లా పళ్ళతో నిండిన మామిడిచెట్టు కనబడింది. రాజు కొడుకు ఆ మామిడిపళ్ళను కొయ్య బోయాడు. "మిత్రమా, వాటిని తాకకు. అవి తినదగిన పళ్ళయితే ఈ అరణ్యంలో ఉండే కోతులు వాటిని ఎప్పుడో కొరికేసేవి," అన్నాడు మంత్రికొడుకు. అంత చక్కని మామిడిపళ్ళను వదిలెయ్యటం బాధగానే ఉన్నా రాజుకొడుకు స్నేహితుడి సలహాను పాటించి, వాటిని కొయ్యకుండానే ముందుకు సాగాడు.

తరవాత రాజుకొడుకు అహిచ్ఛత్రపురం చేరి, పెళ్ళివారింట ప్రవేశించ బోతూండగా మంత్రికొడుకు అతన్ని వెనక్కు లాగేశాడు. ఆ క్షణంలోనే ఆ ఇంటి ముందుభాగం కప్పు కూలింది.



ఎలాగో పెళ్ళి జరిగిపోయింది. ఆ రాత్రి రాజుకొడుకు పడకగదికి వెళ్ళాడు. మంత్రి కొడుకు ముందుగానే ఆ గదిలో ప్రవేశించి దాగి ఉన్నాడు. రాజుకొడుకు పక్కమీద నడుము వాల్చుతూనే తుమ్మ నారంభించాడు. అతను వరసగా నూరుసార్లు తుమ్మాడు. ప్రతిసారీ మంత్రికొడుకు 'చిరంజీవ' అన్నాడు. నూరుసార్లూ అలా 'చిరంజీవ' అన్న మీదట మంత్రికొడుక్కు పరమానంద మయింది. అతను తాను దాగి ఉన్న చోటి నుంచి పైకి వచ్చి, రాజుకొడుకు చూస్తూండగానే ఆ గది నుంచి బయటికి వెళ్ళిపోయాడు.

రాజుకొడుకు అది చూసి ఈర్ష్యచెంది, తమ మధ్య ఉండే స్నేహం కూడా పాటించక, ద్వారపాలకులను పిలిచి, "నా పడక గది ప్రవేశించిన ఆ దుర్మార్గుణ్ణి పట్టి బంధించండి. తెల్లవారగానే వధించండి," అని ఉత్తరు విచ్చాడు.

రాజభటులు మంత్రికొడుకును తెల్లవార్లూ నిర్బంధంలో ఉంచి, తెల్లవారగానే అతనితో సహా వధ్యభూమికి బయలుదేరారు. అప్పుడు మంత్రికొడుకు వాళ్ళతో, "నన్ను ముందుగా ఒక్కసారి రాజుకొడుకు వద్దకు తీసుకుపొండి. నే నతనితో ఒక్కమాట చెప్పాలి. ఆ తరవాత నన్ను వధింతురు గాని," అన్నాడు.

అతను ఇలా అంటున్నాడని వాళ్ళు వెళ్ళి రాజుకొడుకుతో చెప్పారు. అతని మంత్రులు కూడా మంత్రికొడుకు చెప్పేది వినమని రాజుకొడుక్కు సలహా ఇచ్చారు. రాజుకొడుకు మంత్రికొడుకును పిలిపించి, అతని నోట జరిగిన సంగతంతా విన్నాడు. ఇల్లు కూలిపడటం ఒకటి ప్రత్యక్షంగా కనబడటం చేత మిగిలినవి కూడా తప్పక నిజమే అయిఉంటా యనుకుని, మంత్రి కొడుకును క్షమించి, అతనితో ఎప్పటిలాగే స్నేహంగా ఉన్నాడు.





# అపవాదు



పాపన్న ఉండే ఊళ్ళో ఒక దంభయ్య ఉండేవాడు. అతను కాపటానికి ఆస్తిపరుడే కాని, తన తాహతుకు మించి జమీందారు బిడ్డ లాగా బతుకుతూ, జూదం వ్యసనం మూలాన డబ్బు చాలా నష్టపోయి, ఎరిగున్న వాళ్ళందరి దగ్గిరా అప్పులు చేశాడు.

దంభయ్యకు రెండువేలకు పైగా అప్పు పెట్టిన ఒక పెద్దమనిషి, తన అప్పు రెండు మూడు రోజులలో చెల్లించవలిసిందనీ, లేకపోతే దంభయ్య ఇల్లు స్వాధీనం చేసుకుంటాననీ ఒత్తిడి చేశాడు.

అంతదాకా దంభయ్య భార్యకు, తన భర్త అప్పులపాలై ఉన్న సంగతే తెలియదు. ఆమె దంభయ్యతో, "ఇల్లు కాపాడుకోవాలి. నా నగలు ఎక్కడన్నా మంచివాడి దగ్గిర కుదవబెట్టి, డబ్బు తెచ్చి, బాకీ తీర్చెయ్యండి. పిల్ల పెళ్ళి లోపుగా ఎలాగో సొమ్మిచ్చి నగలు విడిపించుకోవచ్చు," అన్నది.

తన పుట్టింటి వారిచ్చిన ఆ నగలను దంభయ్య భార్య పెట్టుకోవటం లేదు. ఆమె వాటిని తన కుమార్తె కోసం భద్రంగా ఒక పెట్టెలో దాచి ఉంచింది. వాటిని అమ్మటానికి గాని, తాకట్టు పెట్టటానికి గాని తన భార్య ఒప్పుకోదని దంభయ్యకు తెలుసు. అయినా అతను వాటిని ఏనాడో సొమ్ము చేసేశాడు. ఒకసారి అతను జూదంలో ఒకతనికి చాలా పెద్ద మొత్తం బాకీపడి, బాకీ మరొకవిధంగా తీర్చలేక, తన భార్యకు తెలియకుండా ఆమె నగలు తస్కరించి తీసుకుపోయి, జూదంలో గెలిచిన వాడికి ఇచ్చేశాడు. తరవాత ఆ ఇద్దరూ ఒక కంసాలి వద్దకు వెళ్ళి, ఆ నగల లాటివే గిల్టు నగలు చేయించారు. దంభయ్య వాటిని తెచ్చి తన భార్య నగలపెట్టెలో ఉంచేశాడు.

ఇప్పుడు భార్య తన నగలను తాకట్టు పెట్టి, సొమ్ము తెచ్చి, బాకీ తీర్చి, ఇల్లు



నిలబెట్టమనేసరికి, "సరే, అలాగే చేద్దాం," అని దంభయ్య నగల పెట్టె తీసుకుని బయలుదేరాడు.

ఈ నకిలీ నగలను ఎవరికి సులువుగా అంటగట్టవచ్చునా అని దంభయ్య ఆలోచించగా పాపన్న జ్ఞాపకం వచ్చాడు. పాపన్న అమాయకుడు. అతను డబ్బు వడ్డీ లేకుండా అప్పిస్తాడు. ఇస్తే గాని సాధారణంగా బాకీ అడగడు. మామూలుగా అప్పు లిచ్చేవాళ్ళ లాగా ప్రశ్నలు వెయ్యడు, పరీక్షలు చెయ్యడు.

ఇలా అనుకుని దంభయ్య తన భార్య నగల పెట్టెను పాపన్న వద్దకు తీసుకుపోయి, "పాపన్నా, ఇదివరకే నేను నీ దగ్గిర మూడువందలు అప్పు చేసి ఉన్నాను. నీకు గుర్తు లేకపోయినా నేను మరిచేవాణ్ణి కాను. పెద్ద చిక్కు వచ్చిపడింది. నువే నన్ను కాయాలి. మా అమ్మాయికి ఒక సంబంధం వచ్చింది. పెళ్ళి ఖర్చులకు అవసరంగా మూడువేలు కావాలి. నువే నా పిల్ల పెళ్ళి చేశావనుకుంటాను. ఇవిగో నా భార్య నగలు. ఇందులో ఒక జత మురుగులూ, కాసుల పేరూ, ఒడ్డాణమూ, జడబిళ్ళా ఉన్నాయి. నువే చూడు," అని జేబులు తడువుకుని, "అరెరే, దీని తాళంచెవి ఇంట్లోనే మరిచిపో యొచ్చినట్టున్నానే!" అంటూ విచారం వెలిబుచ్చాడు.

"నీ మాట చాలదా, దంభయ్యా? నేను నగలు చూడాలా ఏమిటి? తాళంచెవి నీ దగ్గిరే ఉండనీ. తిరిగి ఈ పెట్టెను ఇలాగే తీసుకుపోవచ్చు. నీకు డబ్బిస్తాను. పిల్ల పెళ్ళి జరిపించు. శుభస్య శీఘ్రం," అని పాపన్న మూడువేల రూపాయలూ ఎంచి దంభయ్య కిచ్చి, పంపేసి నగల పెట్టెను లోపల దాచిపెట్టాడు.

ఆ డబ్బుతో దంభయ్య తన బాకీ తీర్చి, ఇంటిని కాపాడుకున్నాడు. తన నగలను మరొకరి దగ్గిరా, మరొకరి దగ్గిరా కాకుండా,

పాపన్న దగ్గిర తాకట్టు పెట్టినందుకు దంభయ్య భార్య కూడా సంతోషించింది.

కాలం గడుస్తున్నది. దంభయ్య భార్య తన నగలను తాకట్టు విడిపించమని భర్తను తొందర చేస్తున్నది. "డబ్బు దొరక లేదు, తొందరపడకు," అని దంభయ్య భార్యకు సమాధాన మిస్తున్నాడు. అతను సాధ్యమైనంతవరకు పాపన్న కంట పడ కుండా తిరుగుతున్నాడు. ఒకసారి పాపన్న కనిపించి, "పిల్ల పెళ్ళి సలక్షణంగా జరిగిందా?" అని అడిగితే, "ఆ సంబంధం తప్పిపోయింది. వేరే సంబంధాలు చూస్తున్నాం," అని దంభయ్య అబద్ధం చెప్పి తప్పించుకున్నాడు.

ఇలా రెండేళ్ళు జరిగిన మీదట దంభయ్య కూతురి కొక మంచి సంబంధం నిజంగానే వచ్చింది. వధూవరులు ఒకరిని ఒకరు చూసుకుని ఇష్టపడ్డారు. వరుడి తండ్రి మటుకు సాలంకృత కన్యాదానం జరగాలని పట్టుబట్టాడు. సాలంకృత కన్య అంటే తలకూ, మెడకూ, చేతులకూ, నడుముకూ బంగారు నగ లుండాలి. యథాశక్తి పిల్లకు ఏవో నగలు పెడతానంటే వరుడి తండ్రి ఒప్పుకోలేదు. వరుడే పట్టుబట్ట వద్దని సలహా ఇచ్చినా అతని తండ్రి విన్నాడుకాడు.



నిక్షేపం లాటి సంబంధం చెయ్యి దాటి పోయేటట్టు కనబడింది. పెళ్ళికూతురు ఏడవసాగింది. తాకట్టు నగలను విడిపించుకు రమ్మని భార్య దంభయ్యను అడిగింది. దంభయ్య తన భార్యను తిట్టి, ఇంకో సంబంధం చూస్తానని ఇంటి నుంచి బయలుదేరి వెళ్ళాడు.

పాపన్న దయతలిస్తే తప్ప తన కూతురికీ పెళ్ళి జరగ దనుకుని, దంభయ్య భార్య తన కుమార్తెను వెంటబెట్టుకుని పాపన్న ఇంటికి వెళ్ళింది.

పాపన్న ఇంట లేడు గాని మీనాక్షి ఉన్నది. దంభయ్య భార్య మీనాక్షిని తన



కూతురి పెళ్ళి ఎలాగైనా జరిపించమని వేడుకున్నది.

"నిజమేనమ్మా, బాకీ తో ముడిపెట్టి మంచి సంబంధం వదులుకుంటారా? మా ఆయన రాగానే మీ నగలపెట్టె మీకు పంపిస్తాను. మీకు నచ్చిన సంబంధాన్ని పోనివ్వకండి," అన్నది మీనాక్షి.

దంభయ్య భార్య ఇంటికి తిరిగి వెళ్ళి, "రేపు నిశ్చితార్థం చేసుకునేటందుకు రండి. మీ ఇష్టప్రకారమే వివాహం జరుపుతాము," అని పెళ్ళివారికి కబురు చేసింది; భర్త రాగానే అతనితో జరిగినదంతా చెప్పి, పాపన్ననూ, మీనాక్షినీ తెగ పొగడింది.



ఇదీ ఒకందుకు మంచిదే ననుకున్నాడు దంభయ్య. అన్నట్టుగానే మర్నాడు పాపన్న నగలపెట్టెతో సహా దంభయ్య ఇంటికి వచ్చాడు. నిశ్చితార్థానికి పాపన్నను కూడా ఉండమని దంభయ్య కోరాడు. కొద్దిసేపట్లో వరుడూ, వరుడి తండ్రీ, పురోహితుడూ, సిద్ధాంతీ వచ్చారు.

దంభయ్య నగలపెట్టె వాళ్ళ ముందు పెట్టి, "ఇవి నా భార్య నగలు. వీటితోనే కన్యాదానం చేతామనుకున్నాం. కాని గ్రహచార వశాత్తు వీటిని ఈ పాపన్నగారి వద్ద మూడువేలకు తాకట్టు పెట్టవలిసి వచ్చింది. అయినా ఆయన సద్బుద్ధితో, అప్పు నింపాదిగా తీర్చుకోమని ఈ నగలు తెచ్చి ఇస్తున్నాడు. ఆయన దయ వల్లనే ఈ పెళ్ళి జరుగుతుంది," అన్నాడు.

"అదంతా ఇప్పు డెందుకులే. పెట్టె తెరిచి లాంఛనగా వారికి నగలు చూపించు," అన్నాడు పాపన్న.

దంభయ్య లేచి వెళ్ళి పెట్టె తాళంచెవి తెచ్చాడు. ఆ తాళంచెవి పాపన్న వద్ద ఉండకపోవటం అందరికీ ఆశ్చర్యం కలిగించింది. దంభయ్య తన కిచ్చిన తాళంచెవిని పాపన్న వరుడి తండ్రి కిచ్చాడు. ఆయన పెట్టె తెరిచి, అందులోని నగలను పైకెత్తి,



"ఏమి టీ నగలు? అన్నీ గిల్టు నగలు! అన్నీ కలిసి యాభైరూపాలు చెయ్యవు," అంటూ దంభయ్య కేసి రౌద్రంగా చూశాడు.

దంభయ్య పాపన్న కేసి అంతకన్న భయంకరంగా చూసి, "ఇదేమిటి, పాపన్నా? నమ్మినందుకు భలేపని చేశావే! అసలు నగలు కాజేసి నకిలీ నగలు పెట్టేశావా? గొప్ప పరోపకారినని చెప్పుకు తిరుగుతూ ఇలాటి పని చేసే నీవంటి వాణ్ణి ఏంచేసినా పాపం లేదు!" అని అరిచాడు.

"తాళంచెవి మీ దగ్గిరే ఉండెగా?" అన్నాడు వరుడు.

దంభయ్య భార్య తన భర్త చేసిన మోసం గ్రహించి, "ఇదంతా నా కర్మ! ఇటువంటి దుర్మార్గానికి ఒడిగట్టిన మనిషి చేజేతులా నా పిల్ల గొంతు కోసేస్తాడు. ఎంత ఘోరం వచ్చిపడిందిరా, దేవుడా!" అని వలవలా ఏడ్చింది.

పాపన్న దంభయ్య భార్యను అవతలికి తీసుకుపోయి, "చూడండమ్మా, నా పైన అపనింద వస్తే పోయిందేమీ లేదు. కాని, ఈ పని చేసిం దెవరో మీకు తెలిసిన పక్షంలో పై కేమీ అనకండి. ఈ పెళ్ళి జరిగి తీరుతుంది. మీరు ఏమీ అనకుండా, ధైర్యంగా ఉండండి," అని చెప్పాడు.



అతను అవతలికి వచ్చి, "ఇప్పుడే ఒక అరగంటలో వస్తాను. అంత దాకా ఆగి ఉండండి," అని చెప్పి చకచకా ఇంటికి వెళ్ళాడు. అతను మీనాక్షితో, "ఒక పిల్ల జీవితం భ్రష్టు కాకుండా చూడాలి. నీ నగలియ్యి," అన్నాడు.

మీనాక్షి తన నగల పెట్టె తీసుకుని పాపన్న వెంట తాను కూడా బయలుదేరి వచ్చింది.

పాపన్న లేని సమయంలో దంభయ్య, పాపన్న మోసగాడన్నది ప్రచారం చెయ్య యత్నించాడు. కాని ఒక్కరు కూడా పాపన్న మోసం చేశాడని నమ్మలేదు.

పాపన్న కోరినందుకే పెళ్ళివారు వెళ్ళిపోకుండా ఆగారు.

ఇంతలో పాపన్న తిరిగి వచ్చి, మీనాక్షి చేతి నుంచి నగల పెట్టె తీసుకుని, తెరిచి పెళ్ళివారి ముందు పెట్టి, "ఈ నగలు పెళ్ళి కూతురికి పెడతాం. పెళ్ళి నిశ్చయం చేసుకోండి," అన్నాడు.

ఈ లోపల నకిలీ నగలను పరీక్షిస్తున్న వరుడు, "ఈ వడ్డాణం మీద దీన్ని చేసిన వాడి గుర్తున్నది. ఇది వెంకటాచారి అనే కంసాలి గుర్తు," అన్నాడు.

ఈ మాట చెవిని పడగానే దంభయ్య ముఖం వెలవెల పోయింది. పాపన్న చప్పున గిల్టు నగలను పెట్టెలో పెట్టి, పెట్టె మూస్తూ, "ఆ గొడవంతా ఇప్పుడు దేనికి? వీటిని దంభయ్య నా దగ్గిర తాకట్టు పెట్టాడు. అవి నా దగ్గిరే ఉంటాయి," అన్నాడు.

పాపన్న ఉదారబుద్ధి అందరికీ స్పష్టమయింది. పెళ్ళికొడుకు తండ్రి మీనాక్షి నగలను తీసుకో నిరాకరిస్తూ, పెళ్ళి నిశ్చయం చేశాడు.

ఈ వృత్తాంతం క్షణంలో ఊరంతా పాక్కింది. ఒక పెద్దమనిషి దంభయ్య ఇంటికి వచ్చి, అక్కడ ఉన్న పెళ్ళిపెద్దతో, "ఇవిగోనండీ మీరు చేసుకోబోయే పిల్ల నగలు. జూదంలో ఓడిపోయి ఈ దంభయ్య నాకీ నగలిచ్చాడు. మేమిద్దరమూ కలిసి నకిలీ నగలు చేయించాం. అసలు నగలను పాపన్నగారు కాజేసి, నకిలీ నగలు పెట్టెలో ఉంచినట్టు అపవాదు పుట్టిందని విని, సహించలేక వీటిని తిరిగి ఇచ్చేస్తున్నాను. జూదంలో గెలుచుకున్నవే గాని, ఈ నగలు నా కష్టార్జితం కావు గనక, ఇవి పోతే నాకేమీ విచారం లేదు లెండి," అన్నాడు.

దంభయ్య కూతురి పెళ్ళి సలక్షణంగా జరిగింది. కాని అంత దాకా ఎంతో గుంభనగా బతుకుతున్న దంభయ్య బతుకే బయటపడింది.





# కవల పిల్లలు

ఒక దేశంలో ఒక పల్లెకారి ఉండేవాడు. చేపల వేట కలిసివచ్చి అతను చాలా డబ్బు కూడబెట్టాడు. కాని ఎవరనుభవించను? అతనికి పిల్లా పీచూ లేరు.

ఒకనాడు పల్లెవాడు సముద్రం మీదికి వెళ్ళి ఉన్న సమయంలో ఒక వృద్ధురాలు వాళ్ళ ఇంటికి వచ్చి, అతని భార్యతో, "బోలెడంత ఆస్తి సంపాదించుకున్నారు; పిల్లలు లేకపోయాక ఏం లాభం?" అన్నది.

"పిల్లలు రాసిపెట్టలేదు, ఎంత విచారపడి మాత్రం ఏం చెయ్య గలం?" అన్నది పల్లెవాడి భార్య.

"అర్థంలేని మాట. నేను చెప్పినట్టు చెయ్యి, నిక్షేపంగా పిల్లలు పుడతారు. నీ భర్త నొక బంగారు చేప పట్టుకురమ్మను. దాన్ని వండి, ఆరు ముక్కలుగా తరుగు. ఒక ముక్క నువు తిను, ఇంకోటి నీ భర్తను తినమను; ఒక ముక్క మీ ఆడకుక్కకూ, మరో ముక్క మీ ఆడ గుర్రానికీ పెట్టు; మిగిలిన రెండు ముక్కలూ ఇంటి ముందు చెరొకపక్కా పాతిపెట్టు," అని ముసలామె తన దారిన తాను వెళ్ళింది.

పల్లెవాడి భార్య ముసలామె చెప్పినట్టే తన భర్త చేత బంగారు చేప తెప్పించి, వండి, ఆరు ముక్కలు చేసి, ఒకటి తాను తిని, మరొకటి తన భర్త చేత తినిపించి, ఒకటి కుక్కచేతా, ఇంకొకటి గుర్రంచేతా తినిపించి, మిగతా రెండు ముక్కలూ ఇంటి ముందు ఇటూ, అటూ పాతి పెట్టింది.

కాలక్రమాన ఇంటి ముందు రెండు పున్నాగ చెట్లు మొలిచాయి. కుక్కా, గుర్రమూ రెండేసి పిల్లలను ఈనాయి. పల్లెవాడి భార్య కవలపిల్లలను కన్నది. ఆ పిల్లలకు మిత్రుడూ, మకరుడూ అని పేర్లు పెట్టారు. ఆ పిల్లలిద్దరి మధ్యా ఏమాత్రమూ తేడా తెలిసేదికాదు. తల్లే భేదం తెలుసుకో

సి. మాధవరావు




లేక, ఇద్దరికీ వేరు వేరు రంగుల దుస్తులు తొడిగేది.

క్రమంగా చెట్లూ, గుర్రాలూ, కుక్కలూ పెరిగాయి. కవలపిల్లలు కూడా పెరిగి, యుక్తవయస్కులైనారు. వాళ్ళకు ప్రపంచం చూడాలని బుద్ధి పుట్టింది. కాని ఇద్దరు కొడుకులూ ఒకేసారి ఇల్లు వదిలిపోవటానికి తల్లి దండ్రులు ఒప్పుకోలేదు. అందుచేత పెద్దవాడైన మిత్రుడు బయలుదేరుతూ, మకరుడితో, "తమ్ముడూ, నా చెట్టును ఒక కంట కనిపెట్టి ఉండు. అది నవనవలాడుతూ ఉన్నంతకాలమూ నన్ను గురించి బెంగ పడనవసరం లేదు. కాని అది వాడినట్టు కనబడితే నేను ప్రమాదంలో ఉన్నట్టు గ్రహించి, నా కోసం బయలు దేరు," అని చెప్పాడు.

మిత్రుడు చాలా రోజులు ప్రయాణించి ఒక నగరం చేరుకుని, అక్కడి పేదరాసి పెద్దమ్మ ఇంట బస చేశాడు. అతడు పెద్దమ్మతో, "పెద్దమ్మా, ఏమిటి ఈ నగర విశేషాలు?" అన్నాడు.

"ఏమున్నది, నాయనా? ఈ రాజుకు జగన్మోహిని అనే కూతురున్నది. దాన్ని పెళ్ళాడతామని ఎందరు వచ్చారో, అందర్నీ రాజు కొరత వేయించాడు," అన్నది పెద్దమ్మ.

మిత్రుడు పెద్దమ్మ ఇంటి కిటికీలో నుంచి, ఎదురుగా ఉన్న రాజభవనం కేసి వింతగా చూసి, "అలాటి విషయాల జోలి మన కెందుకులే. నీకు సంగీతం పాడి వినిపించనా?" అని, తంబూరా మీటుతూ, చాలా చక్కగా పాడాడు. రాజకుమార్తె జగన్మోహిని తన గది గవాక్షం దగ్గిర నిలబడి అతను పాడిన పాటను ఆలకించి తన్మయత్వం చెందింది. పాట పూర్తికాగానే ఆమె తన నౌకరును పిలిచి, "పేదరాసి పెద్దమ్మ ఇంట ఎవరో పాడుతున్నారు, నేను రమ్మన్నానని ఒకసారి ఆ మనిషిని పిలుచుకురా!" అన్నది.

రాజకుమార్తె పిలిచిందనే సరికి మిత్రుడు రాజభవనానికి వెళ్ళాడు. అతన్ని చూడగానే జగన్మోహినికి అతని పైన అపారమైన మోహం పుట్టుకొచ్చింది. ఆమె వెంటనే తన తండ్రి దగ్గిరికి వెళ్ళి, "నాన్నా, నేను పెళ్ళాడగోరేవాడు దొరికాడు," అని చెప్పింది.

"ఏడీ? వాణ్ణి నా దగ్గిరికి పంపించు," అన్నాడు రాజు.

రాజు సమక్షానికి మిత్రుడు వెళ్ళాడు.

"నా కుమార్తె నిన్ను పెళ్ళాడగోరుతున్నది. కాని నువు ఆమెకు తగినవాడివో, కాదో నాకెలా తెలుస్తుంది? నేను చెప్పేది చెయ్యి—చెయ్యలేని పక్షంలో నిన్ను కొరత వేయిస్తాను," అన్నాడు రాజు.

"నాకంత గండగత్తెర ఏమొచ్చింది? నేను మీ అమ్మాయిని పెళ్ళాడతానని కోరలేదే?" అన్నాడు మిత్రుడు.

"ఏమన్నావురా, కుక్కా? రాజకుమార్తె అంటే అంత అలుసుగా ఉన్నదా? ఎవర్రా అక్కడ? ఈ భ్రాష్టుణ్ణి తీసుకుపోయి కొరత వెయ్యండి," అని రాజు కేకలు పెట్టాడు.

"వద్దు, వద్దు. మీరు చెప్పినట్టే చేస్తాను. ఇంతకూ నన్ను ఏం చెయ్యమన్నారు?" అన్నాడు మిత్రుడు.



రాజు కాస్త శాంతించి, మిత్రుణ్ణి ఒక మైదానానికి తీసుకుపోయి, అక్కడున్న ఒక బ్రహ్మాండమైన కొయ్య దిమ్మను చూపి, "రేపు ఉదయం ఒక్క వేటున నీ కత్తితో ఈ దిమ్మను రెండుగా నరకాలి. నరికావా, నా కూతుర్ని పెళ్ళాడతావు; నరకలేక పోయావా, కొరతబడతావు," అన్నాడు.

మిత్రుడు పేదరాసి పెద్దమ్మ ఇంటికి తిరిగి వెళ్ళాడు. "ఏం, నాయనా, అలా ఉన్నావు?" అని పెద్దమ్మ అడిగితే, మనసు కలతగా ఉన్నదని మిత్రుడు చెప్పాడు.

అతని పాట విందామని జగన్మోహిని గవాక్షం వద్ద చాలాసేపు నిలబడి, చివరకు



తానే పెద్దమ్మ ఇంటికి బయలుదేరి వచ్చి, మిత్రుణ్ణితో, "ఈ రాత్రి పాడటం లేదేం?" అని అడిగింది.

"నీ మూలాన నేను రేపు కొరత పడబో తున్నాను. ఇంక పాడేదేమిటి?" అన్నాడు మిత్రుడు. అతను జరిగినదంతా ఆమెతో చెప్పాడు. ఆమె తన తల వెంట్రుక ఒకటి తీసి అతనికిచ్చి, "నీ కత్తికి దీన్ని చుట్టి, ఒక్క పెట్టు పెట్టావంటే, దిమ్మ రెండుగా తెగిపోతుంది," అన్నది.

. మిత్రుడు పాట పాడి ఆమెను సంతోష పెట్టి పంపాడు. అతని పైన ఆమెకు గల మోహం రెట్టింపయింది.

మర్నాడు తెల్లవారుతూనే మిత్రుడు మైదానానికి వెళ్ళి, తన కత్తికి జగన్మోహిని తలవెంట్రుక చుట్టి, దానితో దిమ్మను బలంగా ఒక దెబ్బ కొట్టాడు. దిమ్మ రెండుగా తెగిపోయింది.

రాజు అది చూసి, "బాగుంది. నీ కింకొక పని చెబుతాను. నువ్వు నీ గుర్రం మీద ఎక్కి, రెండు చేతులతోనూ రెండు పాత్రలు పట్టుకుని, వాటి నిండా నీరుపోసి, మూడు గంటలపాటు దౌడు సవారీ చెయ్యాలి. పాత్రలలో నీరు ఒక్క చుక్క చిందినా నిన్ను కొరత వేయిస్తాను," అన్నాడు.

మిత్రుడు జగన్మోహిని వద్దకు వెళ్ళి, "నువ్వు నా కెంత బెడద తెచ్చిపెట్టావే చూడు. నన్ను రాజుగారు అసాధ్యమైన పనులన్నీ చెయ్యమంటున్నాడు," అని, జరిగిన సంగతి ఆమెతో చెప్పాడు.

జగన్మోహిని అతనికి తన చెవి పోగులు రెండిస్తూ, "నీ ప్రాణం కాపాడటానికి నేను లేనా? నువు నాకు ప్రాణంకన్న ఎక్కువైన వాడివిగద! ఈ రెండు పోగులనూ, రెండు పాత్రలలోనూ వేసి నీరు పోశావంటే ఆ నీరు అలాగే గడ్డకట్టిపోతుంది. ఎంత వేగంగా సవారీ చెయ్యిగాక, ఆ నీరు కావాలన్నా తొణకదు," అన్నది.



మిత్రుడు ఆ చెవిపోగుల సహాయంతే, నీటి పాత్రలు చేత బట్టుకుని, ఒక్క చుక్క నీరైనా చిందకుండా, మూడుగంటల పాటు గుర్రం మీద సవారీ అయి వచ్చాడు.

"బాగానే ఉంది. ఇంకొక్క చిన్న ఆఖరు పరీక్ష. రేపు నువ్వొక మనిషితో కుస్తీ పట్టాలి. ఆ మనిషిని నువ్వు ఎత్తి కింద పడెయ్యగలిగావా నా కూతుర్ని పెళ్ళాడతావు—లేదా, కొరత ఉండనే ఉన్నది," అన్నాడు రాజు.

ఆ రోజు రాత్రి మిత్రుడు మంచి సరదాలో ఉన్నాడు. అతను తంబూరా తీసుకుని చాలాసేపు మహా ఆనందంగా పాడాడు. జగన్మోహిని అతని వద్దకు వచ్చి, "ఇవాళ చాలా నిర్విచారంగా ఉన్నట్టున్నావే!" అన్నది.

"అవును. రేపు ఎవడితోనో కుస్తీ పట్ట మన్నారు. వాడూ నా లాటివాడే గద, అందుచేత నా కేమీ భయంలేదు," అన్నాడు మిత్రుడు నవ్వుతూ.

జగన్మోహిని మాత్రం ఈ మాట విని చాలా ఆందోళన పడి, "ఇదే అన్నిటికన్న ప్రమాదమైనది. రేపు నువు కుస్తీ పట్ట బోయేది నాతోనే. నా కేదో తాగటానికి ఇస్తారు. దాంతో నా దేహం పర్వతం లాగా



పెరిగిపోయి, భయంకరంగా తయారవుతుంది. నువ్వా ఆకారాన్ని చూస్తూనే దడుచుకుంటావు. ఆ ఆకారం తన చేతులతో నిన్ను పిండిపిండి చెయ్యగలదు. చూడు, ఈ మంత్రజలం తీసుకో. రేపు నేను నిన్ను సమీపించగానే ఈ నీరు నా ముఖాన చల్లు. అప్పుడు నేను స్పృహ తప్పినట్టవుతాను; నువు నన్ను ఎత్తి కింద పడెయ్య గలుగుతావు," అన్నది.

మిత్రుడామె ఇచ్చిన మంత్రజలం గల బుడిచెంబు తీసుకుని, మర్నాడు ఉదయం కుస్తీలు జరిగే గోదా వద్దకు వెళ్ళాడు. అక్కడికి అతనితో కుస్తీ పట్టటానికి పది





అడుగుల ఎత్తు గల భూతం లాటివాడు వచ్చాడు. ఆ మహాభూతం తనను సమీపించగానే మిత్రుడు తన వద్ద ఉన్న మంత్రజలాన్ని వాడి ముఖాన చల్లాడు. వెంటనే ఆ ఆకారం నీరసపడిపోయి నట్టయింది. మిత్రుడు వాడి నడుము పట్టి ఎత్తి, నేల కేసి కొట్టాడు.

"శబాష్! నా కూతుర్ని నీ కిచ్చి పెళ్ళి చేస్తాను. రేపే ముహూర్తం," అన్నాడు రాజు.

అయితే జగన్మోహినిని పెళ్ళాడాలన్న కోరిక మిత్రుడి కే కోశానాలేదు. ఆనాటి అర్థరాత్రి అతను, పేదరాసిపెద్దమ్మకు చెప్పకుండా తన గుర్రాన్నెక్కి, కుక్కను వెంటబెట్టుకుని, రహస్యంగా ఆ నగరం నుంచి పారిపోయాడు.

తెల్లవారే లోపున అతను మరొక రాజ్యం చేరుకున్నాడు. దాని రాజధాని సముద్ర తీరాన ఉన్నది. అత నక్కడ ఒక సత్రంలో బస చేశాడు. తెల్లవారి అతను సత్రం బయటికి వచ్చేసరికి ఒక గుంపు నెమ్మదిగా నడుచుకుంటూ సముద్రతీరాన గల కొండ వద్దకు పోవటం అతనికి కనిపించింది. ఆ జనమంతా అక్కడ చేరి ఏం చేస్తారో చూతామని అతను తన గుర్రం ఎక్కి, వాళ్ళను అనుసరించి వెళ్ళాడు. ఆ గుంపు మధ్య అతనికొక రాజకుమార్తె కనిపించింది. ఆమె చేతులకొక బంగారు గొలుసు కట్టి ఉన్నది. ఆ గొలుసు పట్టుకుని ఆమెను నడిపించుకుంటూ వెళ్ళి, ఆ మనుషులు కొండకు ఆమెను ఆ గొలుసుతోనే బంధించి, అందరూ వెళ్ళిపోయారు. రాజకుమార్తె దుఃఖించటం మిత్రుడు చూశాడు.

అతను గుర్రం దిగి ఆమెను సమీపించాడు. ఆమె చాలా చక్కనిది.

"నువ్వెందు కేడుస్తున్నావు?" అని అత నామె నడిగాడు.

"నేను చావబోతున్నాను. మా నగరం వాళ్ళు సముద్ర సర్పానికి ఏటా ఒక

కన్యను బలి ఇస్తారు. ఈ యేడు బలి కావటం నా వంతు. కాని నువ్వెందుకిక్కడ ఉన్నావు? త్వరగా వెళ్ళిపో. లేకపోతే నాకు పట్టే దుర్గతే నీకూ పట్టుతుంది," అన్నది రాజకుమార్తె.

"నేను వెళ్ళను," అన్నాడు మిత్రుడు. అతని కామె మీద అమితమైన ప్రేమ కలిగింది.

అంతలోనే సముద్రం తెర్లింది. ఒక మహాసర్పం ఒడ్డుకు వస్తూండటం చూసి, మిత్రుడు తన కుక్కను దాని పైకి ఉసికొల్పాడు. అతని కుక్క ఆ సర్పం కంఠాన్ని గట్టిగా పట్టుకున్నది. మిత్రుడు తన కత్తి దూసి సర్పం మీద కలియబడ్డాడు. సర్పం మహా ఘోరంగా పోట్లాడింది. కాని చివరకు మిత్రుడూ, కుక్కా చేరి ఆ సర్పాన్ని కడతేర్చేశారు.

తరవాత మిత్రుడు రాజకుమార్తె కట్లు ఊడదీసి, ఆమెను తన గుర్రం మీద ఎక్కించుకుని రాజు వద్దకు తీసుకుపోయాడు. జరిగినదంతా విని రాజు సంతోషించి, తన కుమార్తెను మిత్రుడి కిచ్చి మహా వైభవంగా పెళ్ళిచేశాడు. అతను రాజకుమార్తెతో మామగారి ఇంటనే ఉండి సుఖంగా కాలం గడపసాగాడు.



ఒకనాడతనికి వేటకు వెళ్ళాలనిపించింది.

"వేటకు వెళ్ళదలిస్తే పరివారాన్ని వెంటబెట్టుకు వెళ్ళు," అన్నాడు అతని మామగారు.

"నా కే పరివారమూ వద్దు. ఒంటరిగానే పోతాను," అన్నాడు మిత్రుడు. రాజకుమార్తెను పెళ్ళాడాక అతనికి అడుగడుగునా పరివారం వెంట ఉండటంతో చాలా విసుగెత్తింది. అతను సగం ఒంటరిగా ఉండటానికే వేటకు బయలుదేరాడు.

అతను తన కుక్కను వెంట తీసుకుని, గుర్రాన్నెక్కి బయలుదేరాడు. కొంత సేపటికి



అతనికి దాహం వేసింది. ఆ స్థితిలో అతనికి అరణ్యం మధ్య ఒక కుటీరం కనిపించింది. ఆ కుటీరంలో ఒక ముసలిది ఉన్నది. ఆమె మంత్రగత్తె అని తెలియక మిత్రుడామెను కాసిని మంచి నీరు తాగటానికి ఇవ్వమని అడిగాడు.

"నీ కుక్కను చూస్తే భయంగా ఉంది. దాన్ని చరణాకోలతో ఒక్కసారి భయపెట్టనీ," అన్నది ముసలిది.

"భయపెట్టు. అది మంచి కుక్కే," అన్నాడు మిత్రుడు.

ముసలిది ఆకుపచ్చ రంగుగల చరణాకోల తెచ్చి, కుక్కమీద ఛెళ్ళుమనిపించింది. వెంటనే కుక్క కాస్తా శిల అయిపోయింది. మరుక్షణమే ముసలిది తన చరణాకోలను మిత్రుడి పైనా, అతని గుర్రం పైనా ఛెళ్ళుమనిపించింది. వాళ్ళు కూడా శిలలుగా మారిపోయారు.

మంత్రగత్తె వికవికా నవ్వుకుంటూ తన కుటీరంలోకి వెళ్ళిపోయింది.

మిత్రుడు శిల అయిపోగానే అతని ఇంటి వద్ద ఉండే పున్నాగ చెట్లలో ఒకటి వాడనారంభించింది. అది చూసి మకరుడు తన అన్నకేదో విపత్తు సంభవించిందని తెలుసుకుని, తన కుక్కను వెంట బెట్టుకుని, గుర్రం ఎక్కి బయలుదేరాడు.

చాలా రోజులు ప్రయాణం చేసి అతను సముద్రతీరాన ఉన్న నగరానికి చేరి సత్రంలోనే దిగాడు. సత్రం యజమాని అతన్ని చూస్తూనే, "క్షమించండి, ప్రభూ! తమరు రాజకుమార్తెను వివాహమైనప్పుడు నేను రాలేకపోయాను. ఇప్పుడైనా తమకు నాశుభాకాంక్షలు తెలుపుకోనివ్వండి," అన్నాడు.

సత్రం యజమాని తనను చూసి తన అన్న అనుకున్నట్టు మకరుడికి అర్థమయింది. మిత్రుడు రాజకుమార్తెను పెళ్ళాడినట్టు కూడా స్పష్టమయింది. మకరుడు సత్రం యజమానితో, "శుభా

కాంక్షలు మనసులో కలగటం ముఖ్యంగాని, వాటిని ప్రకటించటం అంత ముఖ్యం కాదు," అని చెప్పి, తిన్నగా రాజభవనానికి వెళ్ళాడు.

అతన్ని చూస్తూనే రాజు, "ఏం, నాయనా? ఇన్నాళ్ళూ ఎక్కడికి వెళ్ళావు? నీకేం ప్రమాదం జరిగిందోనని భయపడుతున్నాం," అన్నాడు. ఆయన కూడా మకరుణ్ణి చూసి మిత్రుడనే భ్రమపడ్డాడు.

మిత్రుడి భార్య కూడా అలాటి పొరపాటే చేసింది. ఆమె అతనికి ఆత్రంగా ఎదురు వచ్చి, "ఏమండీ, మీగురించి చాలా భయపడిపోయాం!" అన్నది. మకరుడామె కేసి ఎవరినో చూసినట్టు చూసి, మాటా పలుకూ లేకుండా వెనక్కు తిరిగి మరొక పక్కగా లోపలికి వెళ్ళాడు. ఈ నిరాదరణ చూసి మిత్రుడి భార్య గుడ్లనీళ్ళు కుక్కుకుంటూ అవతలికి వెళ్ళిపోయింది.

ఆ రాత్రి మకరుడు రాజభవనంలో ఉండక సత్రానికి వెళ్ళిపోయాడు. తన అన్న వేటకని బయలుదేరి వెళ్ళినట్టు అతనికి తెలిసింది. అందుచేత అతను తెల్లవారుతూనే తన కుక్కను వెంట బెట్టుకుని, గుర్రం మీద బయలుదేరి, కొంతసేపటికి మంత్రగత్తె కుటీరం దగ్గిరికి



వచ్చాడు. కుటీరం వెలపల శిలల రూపంలో ఉన్న తన అన్ననూ, అతని గుర్రాన్నీ కుక్కనూ మకరుడు గుర్తించాడు.

అతను కుటీరం లోపలికి వెళ్ళి, ముసలిదాని పీక గట్టిగా పట్టుకుని, "ముసలితొత్తా, మా అన్నను మనిషి చెయ్యి," అన్నాడు.

"నీ కుక్కను చూస్తే భయంవేస్తోంది. దాన్ని చరణాకోలతో ఒక్కసారి బెదిరించనియ్యి. తరవాత మీ అన్నను మనిషి చేస్తాను," అన్నది ముసలిది.

మకరుడు తన కుక్కను ముసలిదాని పైకి ఉసిగొల్పాడు. అది వెళ్ళి ముసలిదాని పిక్కను బలంగా పట్టుకున్నది.



"నీ కుక్కను విడిపించు. మీ అన్నను మనిషి చేస్తాను," అన్నది ముసలిది.

"ఏం చెయ్యాలో నాకు చెప్పు. లేదా నా కుక్క నిన్ను తినేస్తుంది," అన్నాడు మకరుడు.

"నాదగ్గిర రెండు చరణాకోల లున్నాయి. ఆకుపచ్చది ఎవరిమీదనైనా ఛెళ్ళుమనిపిస్తే వాళ్ళు శిల అవుతారు. ఎర్రదాన్ని ఛెళ్ళు మనిపిస్తే తిరిగి ప్రాణం వచ్చేస్తుంది," అన్నది ముసలిది. మకరుడు ఎర్ర చరణా కోల తీసుకుని తన అన్న మీదా, అతని గుర్రం మీదా, కుక్కమీదా ఛెళ్ళుమనిపించాడు. ముగ్గురూ మామూలు ప్రాణులయారు.

"ఆ ముండను చీల్చి చెండాడు," అన్నాడు మకరుడు తన కుక్కతో. కుక్క అంతపనీ చేసి, ముసలిదాన్ని చంపేసింది.

అన్నదమ్ము లిద్దరూ తమ గుర్రాల మీద రాజభవనానికి బయలుదేరారు. మకరుడు తనలో తను నవ్వుకుంటూ ఉండటం చూసి, "ఎందుకు నీలో నువు నవ్వుకుంటున్నావు?" అని మిత్రు డడిగాడు.

"మరేమీ లేదు. నీ మామగారూ, నీ భార్యా కూడా నన్ను చూసి నువే అను కున్నారు," అన్నాడు మకరుడు.

మిత్రుడు అసూయతో ఆవేశం చెంది, తన కత్తి దూసి మకరుణ్ణి పొడిచి చంపే శాడు. అతను మకరుడి శవాన్ని దారిలోనే వదిలేసి రాజభవనానికి వెళ్ళాడు. అతని భార్య ఎదురు ఎదురుగా అతన్ని సమీ పించి పలకరించింది. బాగా ఏడ్చినట్టుగా ఆమె కళ్ళు వాచి, ఎర్రబడి ఉన్నాయి.

"ఎందు కేడుస్తున్నట్టున్నావు?" అని అతను తన భార్యను చిరాకుగా అడిగాడు.

"ఏడవ కేం చెయ్యను? నిన్న మీరు వచ్చి, నా కేసి చురచురా చూసి, ఒక్క మాటైనా అనకుండా, నన్నెవరో పరాయి దాన్ని చూసినట్టు చూసి వెళ్ళిపోయారు," అన్నది రాజకుమార్తె.

మకరుడు చాలా ఉదారంగా ప్రవర్తించి నట్టు మిత్రుడికి అర్థమయింది. అలాటి వాణ్ణి అసూయకొద్దీ చంపినందుకు అతను చాలా నొచ్చుకున్నాడు.

మిత్రుడు తన భార్యను వెంటబెట్టుకుని అరణ్యంలో మకరుడి శవం పడి ఉన్న ప్రదేశానికి వెళ్ళాడు.

మకరుడి గుర్రమూ, కుక్కా అక్కడే ఉండి శవాన్ని కాస్తున్నాయి.

మిత్రుడు ఆ శవం మీద ఎర్రచరణాకోల ఛెళ్ళు మనిపించే సరికి మకరుడు నిద్ర లేచినవాడి లాగా లేచి కూర్చుని, "నా కే మయింది? గుర్రం మీది నుంచి కింద పడ్డానా?" అని అడిగాడు.

"లేదు తమ్ముడూ. అసూయ చేత నిన్ను చంపాను. నీకు చాలా అన్యాయం చేశాను, క్షమించు," అన్నాడు మిత్రుడు.

ముగ్గురూ కలిసి సంతోషంగా రాజ భవనానికి తిరిగి వెళ్ళారు.

మర్నాడు ఉదయం మిత్రుడు మక రుడితో, "నువు కూడా పెళ్ళిచేసుకుంటే బాగుంటుంది," అన్నాడు.

"అలాగే చేసుకుంటాను. కాని నన్ను పెళ్ళాడేటందుకు సిద్ధంగా ఎవరున్నారు?" అన్నాడు మకరుడు.

"నిన్ను పెళ్ళాడటానికి తహతహలాడి పోతున్న మనిషే ఉన్నది," అని మిత్రుడు జగన్మోహిని సంగతి చెప్పి, అతన్ని ఆమె ఉండే దేశానికి పంపాడు.

మకరుణ్ణి చూడగానే జగన్మోహిని, "అన్ని అడ్డంకులూ తీరిపోయి, రేపు పెళ్ళి చేసు కుందాంగదా అని నేను ఉబలాట పడు తుంటే ఎక్కడ మాయమయావు?" అన్నది.

"నేను మిత్రుణ్ణి కాను. నా పేరు మకరుడు," అన్నాడు మకరుడు.

"నేను నిన్ను చూసి మోహించాను గాని నీ పేరు చూసి కాదే?" అన్నది జగన్మోహిని. వారిద్దరికీ వైభవంగా వివాహం జరిగింది.






# పిశాచాలతోచెలగాటం

ఆనందు డనే భూస్వామికి కొండవార కొంత పొలం ఉండేది. అది చాలా సార వంతమైనది. పంట చక్కగా పండేది. కాని ఆ ప్రాంతంలో పిశాచాల బెడద ఏర్పడి, ఆ పొలానికి కాపలా ఉండటానికి అందరూ నిరాకరించారు. రాత్రి పూట అక్కడ ఘల్లు ఘల్లు మని గజ్జెల చప్పుడు వినిపించేది. "నా కొకటీ - నా కొకటీ" అన్న పల్లవితో పాట వినిపించేది. అప్పుడప్పుడూ అస్పష్టంగా ఆకారాలు కూడా కనిపించేవి. ఈ పరిస్థితిలో పైరుకు రాత్రిపూట కాపలా కాసేవాళ్ళు లేక, పొలం పాడుపెట్టవలసిన దుస్థితి ఏర్పడింది.

ఆనందుడు ఆ పొలాన్ని ఎవరికైనా అమ్మేసి వదిలించుకోవాలని నిశ్చయించాడు. ఊళ్ళోవాళ్ళందరికీ ఆ పొలంలో పిశాచా లున్నాయని తెలుసు గనక వాళ్ళు ఎలాగూ కొనరు. ఆ సంగతి తెలియని పొరుగూరివాడే దాన్ని కొనాలి. బేరా లేవైనా వస్తే పిశాచాల మాట చెప్పవద్దని ఆనందుడు తన గ్రామం వాళ్ళను కోరాడు. అతను ఊళ్ళో పెద్ద షావుకారు గనక గ్రామస్థులు సరే నన్నారు.

చివరకు ఆనందుడి కొండపొలానికి బేరం వచ్చింది. చంద్రదాసనే ధనికుడు, దూర గ్రామానికి చెందినవాడు, తన అన్నతో భాగాలు పడి, తన వంతు వచ్చిన లక్షరూపాయలతో ఎక్కడన్నా మంచి పొలమూ, అందులోనే ఇల్లూ ఏర్పాటు చేసుకుందామని వచ్చాడు. అతనికి ఆనందుడి పొలం నచ్చింది. వ్యవసాయం తెలిసినవాడు అందులో బంగారం పండించ వచ్చు. అంత మంచి భూమిని సాగు చెయ్యకుండా పాడుపెట్టా రేమని చంద్ర దాసు అడిగితే, "ఊరికి మరీ దూర మయింది. పొలం మధ్యనే ఇల్లు వేసుకునే

ఎ. కామేశ్వరరావు

వాడికి మంచి ప్రదేశం గాని, అంత దూరం రోజూ వచ్చి వెళ్ళాలంటే చాలా ఇబ్బందిగా ఉంది," అన్నాడు ఆనందుడు.

చంద్రదాసు ఆ పొలాన్ని యాభైవేలకు బేరమాడి కొనుక్కుని, అక్కడ మంచి ఇల్లు కట్టించి, తన భార్యతో సహా గృహ ప్రవేశం చేశాడు. తరవాత పొలమంతా చక్కగా దున్నించి, విత్తనాలు చల్లించాడు. రాత్రిపూట పొలానికి కాపలా ఉండటానికి మనుషులను పెట్టుకోపటానికి ప్రయత్నించి నప్పుడు అసలు సంగతి బయటపడింది.

"పగలు పనిచెయ్యమంటే చేస్తాంగాని, రాత్రి పూట పిశాచాలకు కాపలా ఉండటం మా వల్ల కాదు," అనేశారు గ్రామంలో వాళ్ళు. కాపలా అత్యవసరం. సమీపం లోనే అడవి ఉండటం చేత, అడవి జంతువులు పొలంలో జొరబడి ధ్వంసం చేస్తాయి. మోసం జరిగిపోయింది. తన కున్న డబ్బంతా దాదాపు ఖర్చయిపోయింది. గలాటా చేసి లాభంలేదు, అవమానం కూడా. అందుచేత పిశాచాలతో వేగటానికే చంద్ర దాసు నిశ్చయించాడు.

పైరు ఎదిగి వచ్చింది. ఒక మంచె వేసి, దాని పైన చంద్రదాసు తానే కాపలా కూర్చున్నాడు. అర్ధరాత్రి వేళ ఘల్లుఘల్లు



మనీ, తపతప మనీ అస్పష్టంగా ధ్వనులు వినిపించాయి. తరవాత ఆకారాలు కూడా కనిపించాయి. ఒక వంద పిశాచాలు గొంగళ్ళు కప్పుకుని తమ నాయకుడి చుట్టూ నృత్యం చెయ్యటం చంద్రదాసు చూశాడు. అవి, "నా కొకటీ - నా కొకటీ" అని కొంతసేపు పాటపాడి, తరవాత "ఇక చాలూ - ఇక చాలూ - పోదామా - పోదామా" అని పాడుతూ, మాయమయాయి. పైరుకు ఏమీ నష్టం రాలేదు.

చంద్రదాసు ఇదే దృశ్యాన్ని ప్రతి రాత్రీ చూస్తూ వచ్చాడు. మొట్టమొదట అతను పిశాచాలను చూసి గాభరాపడి కొయ్యబారి



పోయాడు గాని, క్రమంగా అతనికి భయం పోయి ధైర్యం వచ్చింది.

ఒకనాటి రాత్రి అతను, తాను కూడా ఒక కంబళి కప్పుకుని, వాటి లాగే కీచు గొంతుతో, "నా కొకటీ - నా కొకటీ" అని పాడుతూ, పిశాచాలతో కలిసి నృత్యం చెయ్యసాగాడు. పిశాచాలనాయకుడు ప్రతి పిశాచానికీ ఒక రత్నహారం ఇచ్చాడు. చంద్రదాసు తాను కూడా ఒక హారం తీసుకుని, "ఇక చాలూ - పోదామా" అని మిగిలిన పిశాచాలతో కలిసి పాడాడు. పిశాచాలన్నీ కదిలి వెళ్ళిపోయాయి. చంద్రదాసు తన మంచె మీదికి వెళ్ళిపోయాడు.



చంద్రదాసు తనకు దొరికిన హారాన్ని పరీక్షించగా అందులో నూరు రత్నాలున్నాయి. అందులో ఒక రత్నాన్ని ఊడదీసి, నగరానికి తీసుకుపోయి అమ్మగా పదివేల రూపాయలు వచ్చాయి. చంద్రదాసు అపరిమితానందం పొంది, తన ఇంటికి తిరిగి వచ్చాడు.

ఇటీవల చాలా విచారంగా ఉంటూ వచ్చిన భర్త ఒక్కసారిగా పరమానందంతో ఉండటం చూసి చంద్రదాసు భార్య కారణ మడిగింది. అతను తన భార్యకు జరిగిన దంతా చెప్పి, "ఈ పిశాచాల వల్ల మనకు గాని, పంటకు గాని ఏమీ నష్టం లేదు. రాత్రిపూట అడవిజంతువులు కూడా రావు. కాపలా దండగ!" అన్నాడు.

"ఇలాగే ఇంకో రెండుమూడు హారాలు తెచ్చుకోరాదూ ?" అన్నది భార్య.

"వద్దు. ఈ ఒక్క హారంతోనే ఎన్ని తరాలైనా బతకవచ్చు. అదీగాక పిశాచాలతో చెలగాటం మంచిది కాదు. నువు మాత్రం ఈ సంగతి ఎవరికీ చెప్పకు," అన్నాడు చంద్రదాసు తన భార్యతో.

కాని ఇంత అద్భుతమైన రహస్యాన్ని తనలోనే ఇముడ్చుకోవటం చంద్రదాసు భార్యకు సాధ్యం కాలేదు. ఆమె తన





పనిమనిషితో అంతా చెప్పేసి, అది పొందిన ఆశ్చర్యానికి గొప్పగా సంతృప్తి పడి, "ఒసే, ఈ మాట ఎక్కడా చెప్పకు," అన్నది.

ఆ పనిమనిషి ఆనందుడి ఇంటికి వెళ్ళి, "పిశాచాల పొలాన్ని మంచి ధరకు అమ్మా మని మీరు సంతోషిస్తున్నారు కాబోలు. అది కొన్నవారు పిశాచాల నుంచి రత్నహారం సంపాదించుకుని, అంతకు నూరింతలు లాభం పొందారు," అంటూ తన యజమానురాలు చెప్పినదంతా, ఆనందుడి భార్యకు చెప్పేసింది.

ఆనందుడి భార్య ఆ కథ అంతా ఆనందుడికి చెప్పింది.

"అరెరే, ఎంత పొరపాటు జరిగింది? ఇలా అని తెలిస్తే ఆ పొలం అమ్మకనే పోదునే," అన్నాడు ఆనందుడు. అతనికి చంద్రదాసు పైన చాలా అసూయ పుట్టుకొచ్చింది. అతను చంద్రదాసును చూడబోయి, "పొలం ఎలా ఉంది? పంట బాగుందా?" అని అడిగాడు.

"మీ దయవల్ల బాగానే ఉంది," అన్నాడు చంద్రదాసు.

"ఈ ప్రాంతాల పిశాచా లున్నాయని ఊళ్ళో ఒక పుకారు లేవదీశారు. రాత్రి కాపలాకు రమ్మంటే భయపడతారు.



మీకేమీ ఇబ్బంది లేదు కద?" అన్నాడు ఆనందుడు.

"పిశాచాలు లేవు, దయ్యాలూ లేవు. నేను చేనుకు కాపలా కూడా పెట్టలేదు. పైరు నిక్షేపం లాగున్నది," అన్నాడు చంద్రదాసు.

చంద్రదాసు నిజం దాస్తున్నట్టు ఆనందుడు నిశ్చయించాడు. తాను విన్న కథ నిజమే అయి ఉండాలి. చంద్రదాసు ఇంట లక్ష్మి తాండవం చేస్తున్నది. పొలం కూడా సస్యలక్ష్మితో కళకళలాడుతున్నది. అందులో మంచె కూడా ఉన్నది. కాపలా లేని పొలంలో మంచె దేనికి? పైవాళ్ళ



రారు గనక చంద్రదాసు తానే పొలానికి కాపలాకాసి, పిశాచాలను మోసగించి, రత్న హారం కాజేసి ఉండాలి.

ఇలా అనుకున్న ఆనందుడికి తాను కూడా పిశాచాల నుంచి ఒక రత్నహారం సంపాదించాలని పుట్టింది.

ఆ రాత్రే అతను కంబళీ ఒకటి కప్పుకుని ఆ పొలానికి వచ్చాడు. మంచె పైన ఎవరూ కాపలా కాయటం లేదు. అంతా ప్రశాంతంగా ఉంది. అర్ధరాత్రి వేళ పిశాచాలు వచ్చాయి. తమ నాయకుడి వద్ద రత్న హారాలు పుచ్చుకున్నాయి. ఆనందుడు కూడా వాటితోపాటు ఆడి, పాడి, రత్న హారం పుచ్చుకున్నాడు. అతని ఆనందానికి మేరలేదు. అతను చల్లగా పిశాచాల మధ్య నుంచి జారుకున్నాడు. అది గమనించి కొన్ని పిశాచాలు, "అడుగో దొంగ! పట్టుకోండి! పట్టుకోండి!" అని అరిచాయి. ఆనందుడు వాటికి దొరికిపోయాడు.

కిందటిసారి తమ హారాలలో ఒకటి పోయినప్పటి నుంచీ పిశాచాలు దొంగ కోసం వెయ్యికళ్ళతో చూస్తున్నాయి. ఆ కారణం చేతనే ఆనందుడు వాటికి తేలికగా దొరికిపోయాడు.

పిశాచాలు ఆనందుడి నుంచి హారం లాక్కుని, అతడి కుడిచేతి పైన ఒక దెబ్బ కొట్టి, తమ దారిన తాము పోయాయి.

మర్నాడు చంద్రదాసు తన పొలంలో స్పృహతప్పి పడి ఉన్న ఆనందుణ్ణి తన ఇంట్లో చేర్చి, గ్రామం నుంచి వైద్యుణ్ణి పిలిపించి, చికిత్స చేయించాడు.

"ఏం జరిగింది? మీరు రాత్రివేళ మా పొలంలోకి ఎలా వచ్చారు?" అని చంద్రదాసు అడిగితే, తన కేమీ తెలియదని ఆనందుడు బొంకాడు.

కాస్త శక్తి రాగానే ఆనందుడు తన ఇంటికి వెళ్ళిపోయాడు. అతని కుడిచెయ్యి శాశ్వతంగా చచ్చుపడిపోయింది.





# ఉత్తరకాండ

రాముడు చేసిన అద్భుతమైన యజ్ఞానికి వాల్మీకి తన శిష్యులతో కూడా వచ్చి, ఋషి వాటికలో తన కోసం ప్రత్యేకించిన పర్ణ శాలలో బస చేశాడు. తాను రచించిన రామాయణాన్ని ఎక్కడపడితే అక్కడ గానం చెయ్యటానికి తన శిష్యులకు ఆయన అనుమతి ఇచ్చాడు. ఆయన కుశలవులతో, "మీ రెవరి బిడ్డలని ఎవరన్నా అడిగితే వాల్మీకి శిష్యులమని చెప్పండి. డబ్బిస్తే పుచ్చుకోకండి. రాముడు పిలిస్తే ఆయన ఎదట కూడా రామాయణాన్ని గానం చెయ్యండి. రాజు గనక ఆయన పట్ల మర్యాద చూపండి," అన్నాడు. "అలాగే, తాతా," అని వాళ్ళు పర్ణశాల నుంచి బయలుదేరారు.

వాళ్ళు రాగతాళయుక్తంగా రామాయణాన్ని గానం చేస్తున్న సంగతి విని రాముడు వారిని పెద్ద సదస్సు మధ్యకు పిలిపించి, గానం చెయ్యమన్నాడు.

ఆ మహా సదస్సులో మునులూ, రాజులూ, పండితులూ, పౌరాణికులూ, సంగీతవేత్తలూ, కళాకారులూ, నాట్యం తెలిసినవారూ, ఇంకెందరో ఉన్నారు.

ఆ రోజు కుశలవులు రామాయణం నుంచి మొదటి ఇరవై సర్గలూ పాడారు. రాముడు లక్ష్మణుడితో, "ఈ కుర్రవాళ్ళకు పద్దెనిమిది వేల సువర్ణాలిప్పించు," అన్నాడు. కాని లక్ష్మణుడు వారికి వేరు వేరుగా బంగారం ఇవ్వబోతే వాళ్ళు, "ఈ బంగారం మా కెందుకు? మేము



అరణ్యంలో కందమూల ఫలాలు తిని జీవించేవాళ్ళం," అన్నారు.

రాము డా మాటలు విని ఆశ్చర్యపడి, "అబ్బాయిలూ, మీరు పాడే ఈ కావ్యం ఎంత ఉంటుంది? దాన్ని ఎవరు రాశారు?" అని అడిగాడు.

"దీన్ని వాల్మీకి మహాముని రాశారు. ఆయన కూడా ఈ యజ్ఞానికి వచ్చిఉన్నారు. మీకు వినాలని ఉంటే రోజూ గానంచేస్తాం," అన్నారు సీతకొడుకులు.

రాముడు సరే నన్నాడు. పిల్లలు రోజూ వచ్చి, అందరి సమక్షంలో కొన్ని సర్గలు చొప్పున చాలా రోజుల పాటు రామాయ



ణాన్ని గానం చేశారు. ఈ గానంతో ఆ పిల్లలు సీత కొడుకులే నన్నది అందరికీ స్పష్టమయింది.

రాముడు తన దూతలను పిలిచి, "మీరు వాల్మీకి మహాముని వద్దకు వెళ్ళి, సీత పవిత్రురా లైన పక్షంలో, ఆమె ఇక్కడికి వచ్చి ఆ సంగతి నిరూపించటానికి ఆ మహాముని అనుమతిని కోరుతున్నానని ఆయనతో చెప్పండి," అని పంపాడు.

దూతలు వచ్చి రాముడి కోరికను విన్నవించగానే వాల్మీకి మహాముని, "సీత రాముడి కోరిక ప్రకారం వచ్చి శపథం చేస్తుంది," అని చెప్పాడు.

దూతలు ఆ మాట చెప్పగానే రాముడు సభికుల ఎదట సీత తన పవిత్రతను వెల్లడించుకో బోతున్నదని ప్రకటించాడు. అందరూ ఈ మాటకు సంతోషించి, రాముణ్ణి అభినందించారు.

మర్నాడు తెల్లవారగానే రాముడు యజ్ఞవాటికకు వెళ్ళి, మహామును లందరికీ కబురు చేశాడు. రాక్షసులనూ, వానరులనూ, నానాదేశాల నుంచి వచ్చిన నాలుగు వర్ణాల వారినీ పిలిపించాడు. అందరూ కూర్చుని ఉండగా వాల్మీకి మహాముని సీతను వెంటబెట్టుకుని వచ్చాడు. వాల్మీకి





వెనక నడిచివచ్చే సీతను చూడగానే అంద రికీ గుండెలు నీరయిపోయాయి.

వాల్మీకి రాముడితో, "రామా, ఈ సీత మహాఇల్లాలు, ధర్మం తప్పనిది. లోకాప వాదుకు వెరచి ఈమెను నా ఆశ్రమం వద్ద వదిలిపెట్టావు. కనక నీకు ఆమె యందు విశ్వాసం కుదిరేటట్టుగా శపథం చేస్తుంది. ఈ బిడ్డ లిద్దరూ సీతకొడుకులు. నే నెన్నడూ అబద్ధమాడిన వాణ్ణి కాను. వీరు నీ కొడు కులు. నేను అంతులేని తపస్సు చేశాను. సీత నిజంగా చెడ్డదైతే, నా తపస్సు ఫలించక పోవుగాక! లోకాపవాదానికి వెరిచావే గాని ఆమెలో ఎలాంటి దోషం లేదని నీకూ తెలుసు," అన్నాడు.

రాముడు వాల్మీకికి నమస్కరించి, "మునీశ్వరా, మీ రన్నది నిజమే. లంక లోనే అగ్నిదేవుడు సీత పవిత్రతకు సాక్ష్యం పలికాడు. అందుకే నే నీమెను నా వెంట ఇంటికి తెచ్చాను. ఈ పిల్లలు నా పిల్లలే నని కూడా నాకు తెలుసును. ఈ మహా సభలో సీత తన నిర్దోషిత్వం రుజువు చేసు కునేటట్టుంటే నే నామెను సంతోషంగా ఏలుకుంటాను," అన్నాడు.

కాషాయవస్త్రాలు ధరించి ఉన్న సీత చేతులు జోడించి, నేల చూస్తూ, "నా మన



సులో రాముణ్ణి తప్ప మరెవరినీ స్మరించని పక్షంలో భూదేవి నాకు దారి ఇచ్చుగాక! మనోవాక్కాయాల నేను రాముణ్ణి పూజించే దాన్నయితే భూదేవి నాకు దారి ఇచ్చు గాక! రాముడు తప్ప నా కింకేమీ తెలి యని పక్షంలో భూదేవి నాకు దారి ఇచ్చు గాక!" అన్నది.

సీత ఇలా అంటూండగానే బలవంతులైన నాగకుమారులు ఒక దివ్యమైన సింహాస నాన్ని మోస్తూ భూమిలో నుంచి పైకి వచ్చారు. సింహాసనం ఎంతో అద్భుతంగా ఉన్నది. నాగకుమారుల తలలోని రత్నాలు వింతగా మెరుస్తున్నాయి. ఆ సింహాసనం





మీద ఉన్న భూదేవి తన రెండు చేతులూ చాచి, సీతను ఎత్తి సింహాసం మీద కూర్చోబెట్టింది. వెంటనే సింహాసనం పాతాళానికి దిగి పోయింది.

ఇది చూసి అందరూ నిశ్చేష్టితులయి పోయారు. కొందరు సీతనే చూస్తూ ఉండి పోయారు. మరికొందరు రాముణ్ణి చూశారు. ఆ తరవాత ఒక్కసారిగా కలకలం బయలు దేరింది. వానరులు ఏడ్చారు. "ఎంతసాధ్వి!" అని మునులు మెచ్చుకున్నారు.

రాముడు చేతికర్ర మీద బరువు వేసి తలవంచుకుని చాలా సేపు కన్నీరుగార్చి, "నే నింత కష్టం ఎన్నడూ అనుభవించ



లేదు. ఓ భూదేవీ, నా సీతను నా కిచ్చెయ్యి, లేదా నాకు కూడా దారి ఇయ్యి. ఎవరురా, నా ధనుర్బాణాలు తెండి. ఈ భూమిని బద్దలు చేస్తాను," అని ఆవేశపడ్డాడు. అందరూ చేరి అతన్ని ఓదార్చారు.

వాల్మీకి కుశలవులను వెంటబెట్టుకుని తన పర్ణశాలకు వెళ్ళాడు. ఆ రాత్రి సీతను గురించిన స్మరణలతోనే గడిచిపోయింది.

మర్నాడు మళ్ళీ సభ జరిగినప్పుడు కుశలవులు ఉత్తర రామాయణాన్ని గానం చేశారు. దానితోనే యజ్ఞకాండ ముగిసింది. యజ్ఞానికి వచ్చినవారి నందరినీ తగిన విధంగా సత్కరించి రాముడు అయోధ్యకు తిరిగి వచ్చాడు. అతను వచ్చేటప్పుడు తన కొడుకులను వెంట తెచ్చుకున్నాడు. అతను మరొక స్త్రీని పెళ్ళాడక, బంగారు సీతను పక్కనే ఉంచుకుని అనేక అశ్వమేధ, వాజపేయ యజ్ఞాలు చేశాడు. అతను ధర్మం నిలబెట్టటానికి యత్నిస్తూ, న్యాయంగా పరిపాలన చేసి, ప్రజల ఆదరం పొందాడు. అతని పరిపాలనలో దేశం సుభిక్షంగా ఉన్నది. అకాలమరణాలూ, ఈతిబాధలూ లేవు.

కాలక్రమాన కౌసల్యా, సుమిత్రా, కైకేయీ మరణించారు. వారికి రాముడు



ఉత్తరక్రియలు చేసి, గొప్పగా దానధర్మాలు చేశాడు.

కొంత కాలం గడిచాక రాముడి వద్దకు కైకేయి అన్న అయిన యుధాజిత్తు వద్ద నుంచి గార్గ్యుడు పదివేల గుర్రాల కానుకతో సహా వచ్చి, "రామా, మీ మామ నీతో ఇలా చెప్పమన్నాడు. సింధునదికి రెండు పక్కలా గల గంధర్వదేశం శోభతో కూడినది. అక్కడ శైలూషుడి సంతతికి చెందిన గంధర్వులు మూడుకోట్లమంది, మహాబలవంతులున్నారు. వారిని జయించి గంధర్వదేశాన్ని వశపరుచుకో. నీ హితం కోరి ఈ మాట చెప్పాను," అని యుధాజిత్తు తరఫున సందేశ మిచ్చాడు.

"మంచిది. ఈ కుర్రవాళ్ళు భరతుడి కొడుకులు; తక్షుడూ, పుష్కలుడూ అనే వాళ్ళు. వీళ్ళ వెంట భరతుణ్ణీ, సేననూ పంపుతాను. భరతుడు గంధర్వులను జయించి, గంధర్వదేశాన్ని రెండుగా విభజించి, తన ఇద్దరి కొడుకులనూ వాటికి రాజులుగా చేసి తిరిగి వస్తాడు," అన్నాడు.

ఆ ప్రకారమే భరతుడు పెద్ద సేనను వెంటబెట్టుకుని పదిహేను రోజులు ప్రయాణం చేసి, కేకయదేశాన్ని చేరి, యుధాజిత్తును కలుసుకున్నాడు. తరవాత



ఇద్దరూ కలిసి గంధర్వుల మీదికి యుద్ధానికి వెళ్ళారు. యుద్ధంలో గంధర్వులు నశించారు. భరతుడు వారి దేశాన్ని జయించి, తక్షుడికి తక్షశిల అనే నగరాన్నీ, పుష్కలుడికి పుష్కలావతి అనే నగరాన్నీ ఏర్పాటు చేసి, ఆ పట్టణాలలో అయిదేళ్ళపాటు ఉండి, అయోధ్యకు తిరిగి వచ్చాడు.

ఇక లక్ష్మణుడి కొడుకులైన అంగదుడికీ, చంద్రకేతుడికీ రాజ్యాలు ఏర్పాటు కావలిసి ఉన్నది. వాళ్ళు ఏలదగిన దేశం ఏదన్నా ఉంటే చూడమని రాముడు లక్ష్మణుడితో అన్నాడు. కారుపథ మనే దేశం అందుకు తగి ఉన్నదని లక్ష్మణు డన్నాడు. దాన్ని



అంగదుడి కోసమూ, చంద్రకాంత మనే దేశాన్ని చంద్రకేతుడి కోసమూ ఏర్పాటు చేస్తే బాగాఉంటుందని నిర్ణయం జరిగింది. అంగదుడి వెంట లక్ష్మణుడూ, చంద్రకేతుడి వెంట భరతుడూ వెళ్ళి ఆయా దేశాలలో వారికి రాజ్యం ఏర్పాటు చేసి అయోధ్యకు తిరిగి వచ్చారు.

కాలం గడిచిపోయింది. ఒకనాడు యముడు మునివేషంలో రాముడి రాజ భవనానికి వచ్చి, లక్ష్మణుణ్ణి చూసి, "లక్ష్మణా, నేను ఒక గొప్ప మహర్షి దూతగా రాముణ్ణి పని మీద చూడవచ్చానని రాముడితో చెప్పు," అన్నాడు.



లక్ష్మణు డా మాట చెప్పగానే రాముడు మునిని లోపలికి పంపమన్నాడు. యముడు వచ్చి, రాము డిచ్చిన అర్ఘ్యపాద్యాలు స్వీకరించి, "రామా, మనం ఏకాంతంగా మాట్లాడాలి. మనం మాట్లాడుకునేటప్పు డెవరైనా వచ్చేపక్షంలో నీవు వారికి మరణ శిక్ష విధించాలి. అందు కిష్టమయే పక్షంలో నేను వచ్చిన పని చెబుతాను," అన్నాడు.

రాముడు సరేనని, లక్ష్మణుణ్ణి పిలిచి, "లక్ష్మణా, ద్వారపాలకుణ్ణి పంపేసి, నువే ద్వారం వద్ద ఉండు. మేం మాట్లాడు కుంటుండగా ఎవరు లోపలికి వచ్చినా మరణ దండన తప్పదు," అని చెప్పాడు.

తరవాత యముడు రాముడితో, "రామా, నేను మారువేషం ధరించి వచ్చిన యముణ్ణి, బ్రహ్మ పంపగా వచ్చాను. బ్రహ్మ నీతో ఇలా చెప్పమన్నాడు: నీవు రావణ సంహారం కోసం అవతరించిన విష్ణువువు. నీవు భూలోకానికి వచ్చిన పని అయిపో యింది. నీకు ఎప్పుడు తిరిగి రావాలని ఉంటే అప్పుడు తిరిగి రా," అన్నాడు.

రాముడు నవ్వి, "నీ రాక నాకు చాలా సంతోషం కలిగించింది. నేను కూడా ఎక్కడి నుంచి వచ్చానో అక్కడికి వెళ్ళటా నికి సిద్ధంగానే ఉన్నాను," అన్నాడు.





లోపల రాముడు యముడితో ఇలా మాట్లాడే సమయంలో దుర్వాసుడు వచ్చి, "లక్ష్మణా, ఇప్పుడే నేను రాముణ్ణి చూడాలి," అన్నాడు.

"స్వామీ, మా అన్న మరొక పనిలో నిమగ్నుడై ఉన్నాడు. కొంచెం ఆగాలి. మీరేం పని మీద వచ్చారో, నా వల్ల మీ కేం కావాలో చెప్పండి," అన్నాడు లక్ష్మణుడు.

దుర్వాసుడు ఉగ్రుడై, "వెంటనే నన్ను రాముడి దగ్గిరికి తీసుకుపోక పోయావో మీ వంశమంతా నిర్మూలమయేటట్టు శపిస్తాను," అన్నాడు. తాను ఒక్కడే చచ్చినా నష్టం లేదనీ, సర్వనాశం కారాదనీ ఆలోచించి లక్ష్మణుడు లోపలికి వెళ్ళి రాముణ్ణి పిలిచాడు.

రాముడు లేచివచ్చి, దుర్వాసుడికి నమస్కరించి, "స్వామీ, ఏమి ఆజ్ఞ?" అని అడిగాడు.

"నాకు వెంటనే భోజనం పెట్టించు," అన్నాడు దుర్వాసుడు. రాము డాయనకు భోజనం పెట్టించాడు. దుర్వాసుడు భోజనం చేసి, సంతోషించి వెళ్ళిపోయాడు.

రాముడికి తన శపథం జ్ఞాపకం వచ్చి విచారం కలిగింది. లక్ష్మణు డతన్ని సమీపించి, "అన్నా, నా కోసం దిగులు పడకు. నన్ను చంపి నీ మాట నిలబెట్టుకో," అని చెప్పాడు.

రాముడు తన మంత్రి పురోహితులను పిలిచి వారికి జరిగిన దంతా చెప్పి వారి సలహా కోరాడు.

"రామా, లక్ష్మణుణ్ణి విడిచిపెట్టెయ్యి. త్యాగం వధతో సమానం. ధర్మభంగం కలగరాదు," అని వసిష్ఠు డన్నాడు.

లక్ష్మణుడు రాముడికి నమస్కారం చేసి, తన ఇంటికి కూడా పోకుండా, తిన్నగా సరయూతీరానికి వెళ్ళి, శ్వాస స్తంభింప జేసి, యోగం పట్టాడు. ఇంద్రుడు విమానంలో అదృశ్యంగా దిగివచ్చి లక్ష్మణుణ్ణి

శరీరంతో సహా స్వర్గానికి తీసుకుపోయాడు. విష్ణువులో నాలుగో భాగం తిరిగి వచ్చేసింది.

తరవాత రాముడు సభచేసి, "లక్ష్మణుడి లాగే నేను కూడా వెళ్ళిపోతాను. భరతుడికి పట్టాభిషేకం చేసే ఏర్పాట్లు చెయ్యండి," అన్నాడు. ఆ మాట విని భరతుడికి మతి పోయినట్టయింది. "నువు లేని రాజ్యం నా కెందుకు? కుశలవులకు పట్టం కట్టు. కోసలకు కుశుణ్ణీ, ఉత్తరకోసలకు లవుణ్ణీ రాజును చెయ్యి. మనం స్వర్గానికి పోతున్నామని శత్రుఘ్నుడికి కబురు చేద్దాం," అన్నా డతను.

భరతు డన్న ప్రకారమే కుశలవుల పట్టాభిషేకం జరిగింది. శత్రుఘ్నుణ్ణి పిలుచుకు రావటానికి మధురాపురానికి దూత వెళ్ళాడు. శత్రుఘ్నుడు తన రాజ్యాన్ని కూడా తన కొడుకులైన సుబాహుడూ, శత్రుఘాతీ అనే వాళ్ళకు పంచి అయోధ్యకు తిరిగి వచ్చాడు.

రాముడు స్వర్గానికి పోతున్నా డన్న వార్త విని సుగ్రీవ విభీషణులు సపరివారంగా వచ్చేశారు. సుగ్రీవుడు అంగదుడికి పట్టాభిషేకం చేసి మరీ వచ్చాడు.

తరవాత రామప్రస్థానం ప్రారంభమయింది. రాముడు సన్నని బట్ట కట్టుకుని, చేత దర్భలు పట్టుకుని, మౌనంగా నడవ సాగాడు. అతని వెంట అంతఃపుర స్త్రీలూ, భరతశత్రుఘ్నులూ, మంత్రులూ, భృత్యులూ, వానరులూ బయలుదేరారు. కొంత దూరం నడిచి రాముడు సరయూ నదిని చేరాడు. రాముడు ఆ నదిలో పాదాలు పెట్టాడు. అతనికి బ్రహ్మ పిలుపు వినబడింది. రాముడికీ, భరతశత్రుఘ్నులకూ వైష్ణవ శరీరాలు వచ్చేశాయి. విష్ణువు బ్రహ్మను చేరాడు. అతనితో బాటు అవతరించిన వారందరూ తమతమ లోకాలకు తిరిగి చేరుకున్నారు.

* సంపూర్ణం *





# అరణ్యపురాణం

## 3

అకేలా ప్రశ్నకు ఎవరూ జవాబు చెప్పలేదు. తోడేలమ్మ లడాయి తప్పదనుకుని అందుకు సిద్ధమయింది. అంతలో ఎలుగుబంటు భాలూ, లేచి నిలబడి గొంతు సవరించుకున్నాడు. తోడేలు పిల్లలకు ఈ భాలూయే అరణ్య చట్టం ఉపదేశిస్తాడు. అతను తినేది కాయలూ, దుంపలూ, తేనె లాటి సాత్వికాహారమే గనక అతను సదస్సుకు యథేచ్ఛగా వస్తూ పోతూ ఉండవచ్చు.

"మనిషికూన! మనిషికూనను నేను శిఫార్సు చేస్తున్నాను. మనిషికూన వల్ల అపాయం ఏమీ లేదు. మందలోపడి తిరగనివ్వండి. నా శిష్యుడుగా ఉంటాడు," అన్నాడు భాలూ.

"భాలూ శిఫార్సు చేశాడు. అతను మన పిల్లలకు గురువు. మరెవరు ఎన్నిక చెయ్యబోతారు?" అని అడిగాడు అకేలా.

ఒక నల్లని నీడ వలయం మధ్యకు వచ్చింది. ఆ వచ్చినది బాఘీర అనే నల్ల చిరుతపులి. బాఘీరను అందరూ ఎరుగుదురు. అతని కెవరూ ఆగ్రహం తెప్పించరు. అతను జిత్తులకు తబకీకి తీసిపోడు, ధైర్యంలో అడవిఎనుమునూ, దుస్సాహసంలో గాయపడిన ఏనుగునూ పోలినవాడు. అతని మాట మహా మెత్తన, వంటి మీది రోమాలు పకినూగు కన్న కూడా మెత్తన.

"అకేలా, స్వతంత్ర ప్రజలారా! నాకు మీ సదస్సులో ఎలాటి స్థానమూ లేదు. కాని అరణ్య చట్ట ప్రకారం ఒక కూన గురించి సందేహం ఏర్పడినప్పుడా కూనను వెల ఇచ్చి కొనవచ్చును. కాని ఎవరు కొనవచ్చుననేది స్పష్టంగా చెప్పబడలేదు. నే నన్నది నిజమేనా?" అని బాఘీర అడిగాడు.

అట్ట చివరి బొమ్మ



"నిజమే. ఎవరైనా కూనను కొనవచ్చు," అని అనేకమంది యువకులు జవాబిచ్చారు.

"అసహాయంగా ఉన్న కూనను చంపటం అన్యాయం. అదీగాక పెరిగాక అతను మీ వేటకు మరింత బాగా ఉపకరించవచ్చు. భాలూ ఈ బిడ్డను శిఫార్సు చేశాడు. నేను మీ కొక బలిసిన ఎద్దును ఇస్తాను. ఇక్కడికి అరమైలు లోపు దూరాన ఇంతకు ముందే చంపాను. అది తీసుకుని మీరీ మనిషి కూనను స్వీకరించండి. అది సాధ్యం కాదా?" అన్నాడు బాఘీర.

అందరూ తలా ఒకమాటా అన్నారు. ఇంతలో మునిగిం దేమిటి? కూనగాడు శీతాకాలపు వానలకు చావనే చస్తాడు. లేదా ఎండలకు ఎండుతాడు. కప్పాయి వల్ల వచ్చిపడే ప్రమాద మేమిటి? ఎద్దు ఎక్కడ? తీసుకుందాం.

"బాగా చూడండి తోడేళ్ళలారా, బాగా చూడండి!" అని అకేలా హెచ్చరింపు వినపడింది.

మౌగ్లీ గులకరాళ్ళతో ఆడుకోవటంలో నిమగ్నుడై, తోడేళ్ళు తన వద్దకు వచ్చి పరిశీలించటం గమనించనే లేదు. తోడేళ్ళన్నీ చచ్చిన ఎద్దు కోసం కొండ దిగి చక్కాపోయాయి. చివరకు అకేలా, బాఘీరా, భాలూ, మౌగ్లీ, వాడి తాలూకు తోడేళ్ళూ మాత్రమే మిగిలారు. షేర్‌ఖాన్ గాండ్రింపు వినపడుతూనే ఉంది. మౌగ్లీని తన కివ్వలేదని అతనికి చాలా కోపంగా ఉంది.

"అలాగే గాండ్రిస్తూ ఉండు. ఎప్పుడో ఈ కూన నీ చేత మరొకలాగా గాండ్రింపజెయ్యకపోడులే," అన్నాడు బాఘీర.

"మంచి నిర్ణయమే జరిగింది. మనుషులూ, వాళ్ళ కూనలూ జ్ఞానం గల వాళ్ళు. వీడి వల్ల కాలక్రమాన చాలా లాభం కలగవచ్చు," అన్నాడు అకేలా.

"అవసరం కలిగినప్పుడు లాభం ఎంతైనా ఉంటుంది. ఏ ఒకరూ మందకు శాశ్వత



నాయకత్వం వహించలేరు గద," అన్నాడు బాఘీర. అకేలా మాట్లాడలేదు. ప్రతి మంద నాయకుడికీ ఒక సమయం వస్తుంది; అతని శక్తి ఉడిగిపోతుంది; అప్పుడతన్ని తోడేళ్ళు చంపేస్తారు; కొత్తనాయకుడు వస్తాడు— కాలక్రమాన వాణ్ణీ చంపేస్తారు. అలాటి సమయం గురించి అకేలా ఆలోచించి, "భాలూ, వాణ్ణి తీసుకుపోయి, స్వతంత్ర ప్రజలకు అర్హమైన శిక్షణ ఇయ్యి," అన్నాడు.

ఆ విధంగా మౌగ్లీ సీయోనీ తోడేళ్ళ మందలో ప్రవేశించాడు. అందుకు భాలూ చేసిన శిఫార్సు, ఒక ఎద్దు లంచమూ సహాయ పడ్డాయి.



* * * *

పది పన్నెండేళ్ళు గడిచాయి. మౌగ్లీ తోడేళ్ళతో ఆ కాలమంతా ఎలా గడిపాడో, ఏమేమి వింతలు జరిగాయో ఊహించ వలసిందేగాని, వివరించటం సాధ్యం కాదు. వాడు తోడేలు కూనలతోబాటే పెరిగాడు. అయితే వాడి బాల్యం ఇంకా వదలక ముందే తోడేలు కూనలు పెరిగి పెద్దవాళ్ళయారు. వాడు తోడేలయ్య దగ్గిర సకల విద్యలూ అభ్యసించి, అరణ్యంలో ఏది ఏమిటో తెలుసుకున్నాడు. ఎక్కడ ఏ గడ్డి కదిలినా, రాత్రివేళ ఏ పిల్లగాలి వీచినా, పైన




ఏ గుడ్లగూబ అరిచినా, ఏ గబ్బిలం కాలి గోరు చెట్టును గీరినా, ఏ చేపపిల్ల మడుగులో ఎగిరినా, వాడికి దాని అంతరార్థం అవగత మయేది.

విద్యాభ్యాసం లేని ఆటవిడుపు సమయాలలో వాడు ఎండపొడలో కూర్చుని కునుకు తీసేవాడు. తిండి తినేవాడు, మళ్ళీ నిద్ర పోయేవాడు. ఒళ్ళు మురికిగా తోచినా, వేడెక్కినా అరణ్యం లోని మడుగుల్లో ఈదేవాడు. తేనె కావలిసివస్తే చెట్లెక్కేవాడు. వాడికి చెట్లెక్కటం బాఘీర నేర్పాడు. బాఘీర ఒక కొమ్మ మీద సాగి పడుకుని, "రా, తమ్ముడూ," అని పిలిచేవాడు. మౌగ్లీ

మొదట్లో కొమ్మలను పట్టుకుని ఎంతకూ విడిచిపెట్టేవాడు కాదు, కాని త్వరలోనే, కోతి లాగా ఒక కొమ్మ నుంచి మరొక కొమ్మకు ఊగటం నేర్చాడు.

కొండ మీద మంద సమావేశమైనప్పుడు మౌగ్లీ కూడా సమావేశాలలో పాల్గొనేవాడు. ఆ సమయంలో ఒక చిత్రం కనిపెట్టాడు: వాడు ఏ తోడేలు కేసి గాని తేరిపార చూస్తే, ఆ తోడేలు కళ్ళు వాలిపోయేవి. అందుచేత వాడు అల్లరికి తోడేళ్ళను తేరిపార జూసే వాడు. ఇతర సమయాలలో వాడు తన తోడేలు మిత్రుల పాదాలలో గుచ్చుకునే పాడుగైన ముళ్ళను తీసేసేవాడు. తోడేళ్ళకు ముళ్ళబాధ జాస్తి.

రాత్రివేళ మౌగ్లీ కొండ దిగి సేద్యపు భూములు ప్రవేశించి, అక్కడి గుడిసెలలో నివసించే మనుషులను వింతగా గమనించే వాడు. అయితే వాడికి మనుషు లంటే చాలా అనుమానం. ఒకనాడు బాఘీర వాడికి ఒక బోను చూపించాడు. అది అరణ్యంలో చాలా యుక్తిగా అమర్చి ఉండి, పెట్టెలాగున్నది; మౌగ్లీ అందులోకి వెళ్ళి నంత పని చేశాడు కూడా.

బాఘీర వెంట చీకటిగా ఉండే కీకారణ్యం మధ్యకు వెళ్ళి, పగలల్లా నిద్రపోయి, రాత్రివేళ బాఘీర వేటాడుతూంటే చూడటం వాడికి అన్నిటి కన్న ఆనందంగా ఉండేది. బాఘీర ఆకలిగా ఉన్నప్పుడు ఎడాపెడా మృగాలను చంపేవాడు. మౌగ్లీ కూడా అలాగే చంపేవాడు. అయితే వాడికి బాఘీర ఒక్క అంక పెట్టాడు: "ఒక ఎద్దు ప్రాణానికి నిన్ను మంద కొన్నది. అందుచేత పశువును మాత్రం చంపకు. ఈ అరణ్యమంతా నీదే. నీ బలం చాలిన మేరకు మరే జంతువునైనా చంపు, కాని ఏ వయసులో ఉండే పశువునూ చంపకు, తినకు. అది అరణ్య శాసనం," అన్నాడు బాఘీర. మౌగ్లీ దాన్ని మీరలేదు. —(ఇంకావుంది)



# 57. కాంబోడియా రజతబౌద్ధాలయం

కాంబోడియా రాజధాని అయిన ఫ్నామ్‌పెన్‌లో ఈ ఆలయం ఉన్నది. దీని నేల పైన 4,700 వెండి పలకలు పరిచారు. అద్దపుపెట్టెలో ఉన్న బుద్ధవిగ్రహానికి 190 పౌనుల బంగారం పట్టింది.



Photo by Madangopal



బహుమతి
పొందిన వ్యాఖ్య

నిండుకుండను మోస్తున్నాను

పంపినవారు:
కె. ఎ. కుమార్, విజయవాడ

Photo by Ranbir S. Bakhshi



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఓటికుండను చూస్తున్నాను

పంపినవారు :
కె. వి. కుమార్, విజయవాడ

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1966 అక్టోబర్ నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ అగష్టు నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## ఆగష్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : నిండుకుండను మోస్తున్నాను

రెండవ ఫోటో : ఓటికుండను చూస్తున్నాను

పంపినవారు : కె. విజయకుమార్, ఆంధ్రా

సిమెంట్‌కంపెనీ కాలనీ, విజయవాడ-5

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at The B. N. K. Press Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# తలనొప్పి

ఎక్కువగా ఉన్నా

# తలకేగా!

# అమృతాంజనం వాడి

## శీఘ్రంగా నివారణ పొందండి

స్థానికంగా ఉండే బాధను నివారించుకోడానికి ఊరికే మందులు ఎందుకు పుచ్చుకుంటారు? నొప్పి ఉన్న చోటుమీద అమృతాంజన్ రాసి అమోఘంగా శీఘ్రంగా నివారణను పొందండి. ఏ అపాయం లేకుండా కండరాల నొప్పులకు, తలనొప్పికి, బెణుకులకు ఇంకా కీళ్ల నొప్పులకు అమోఘంగా గుణమిచ్చే అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు. అమృతాంజన్ గుండెజలుబుకే కాక సాధారణ జలుబులకు కూడా మంచి మందు. కొంచెంకొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది కాబట్టి ఒక సీసా మీ కుటుంబానికంతాకలిపి నెలల తరబడి వస్తుంది.

అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ల ప్రసిద్ధినిపొందిన నమ్మకమైన గృహఔషధం.




అమృతాంజన్ నొప్పులు జలుబుల నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు.

అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు - బొంబాయి - కలకత్తా - ఢిల్లీ




నిరాల—వేరు మాదిరి సబ్బు!

ఎక్కువ ఉజ్వలమైన, శుభ్రమైన ఉతుకు కొరకు నిరాల సబ్బును తప్పకుండా వాడి చూడండి. అది సునాయాసంగా మురికి నంతటినీ ఉతికి వేయును. నిరాల సబ్బు వేరు మాదిరి సబ్బు కాబట్టి సొమ్ము యొక్క విలువ పూర్తిగా మీకు గిట్టుతుంది.

నిరాల—వేరు మాదిరి సబ్బు
దానిలో జంతువుల క్రొవ్వు లేదు




ASP/N-8 TEL.

తుంగభద్ర ఇండస్ట్రీస్ లిమిటెడ్, కర్నూలు.

బ్యాంకు అంటే ఏమిటి నాన్నా?

ఎక్కడ నువ్వు సొమ్మును దాచుకుని, నీకు కావలసినప్పుడు సొమ్మును తీసుకుంటావో, అదే బ్యాంకు-

దాన్ని యింటిదగ్గరే ఎందుకు దాచుకోకూడదు?

అది యింటి దగ్గర భద్రంగా వుండదు. దాన్ని ఎవరైనా దొంగిలించవచ్చును. లేకపోతే ఎలుకలు, చెదపురుగులు దాన్ని పాడుచేయవచ్చును. నేనే దాన్ని, నిజంగా మనకి అవసరం లేని వాటికోసం ఖర్చు చేసేయవచ్చును. బ్యాంకులో నా సొమ్ము రాత్రింబవళ్లు భద్రంగా దాచబడుతుంది. మరియు బ్యాంకు వడ్డీని యిస్తుంది. నా సొమ్ము పెరుగుతుంది.

ఓహో యిది అద్భుతంగావుంది! నీ బ్యాంకు ఏది నాన్నా?

అబ్బాయి, నాది పంజాబ్ నేషనల్ బ్యాంకు. ఇది చాలా పురాతనమైనది, పెద్ద పెద్ద బ్యాంకులలో ఒకటి. మరియు దీనికి 475 కంటె ఎక్కువ బ్రాంచీలున్నాయి.

# పంజాబ్ నేషనల్ బేంక్

PR-PNB-TEL 6432




FOR PRECISION IN...



Colour Printing

By Letterpress...

...Its B. N. K's., superb printing
that makes all the difference.
Its printing experience of
over 30 years is at the
back of this press superbly
equipped with modern
machineries and technicians
of highest calibre.

B.N.K. *PRESS PRIVATE LIMITED.*

*CHANDAMAMA BUILDINGS,*

*MADRAS - 26*


మానవసేవే మాధవసేవ!


జవహర్‌లాల్ నెహ్రూ
యిలా అన్నారు. "ఖాళీ సౌఖ్యానికి
విశ్రాంతికి తావులేదు. మనము ఎడతెగక
కష్టపడి పనిచేయాలి." కనుక
ఆయన ఆత్మకు శాంతి చేకూర్చడానికి ఎక్కువ పనిచేసి
జాతీయ సంపదకు ఎక్కువ ఉత్పత్తి చేద్దామని కంకణము కట్టుకొందాము.


జె. బి.
మంఘారామ్
& కంపెనీ
గ్వాలియర్ & హైదరాబాదు

OJB-136 Te










# పోల్సన్స్ కాఫీ

రుచికి శ్రేష్ఠం









బహుమాన కూపన్‌లను కూడబెట్టండి.

వెన్న, నెయ్యి, పిండి, మరియు టీకి పోల్సన్ ఇంట్లో వాడుకపడం కూడాను ■ పోల్సన్ లిమిటెడ్., బొంబాయి—ఆనంద్—పాట్నా.










# దిలీప్ బృందం
## తోటపని













JWTUC 2931

# AWARDS!

## WON PLENTY

YET WE DON'T SAY
WE ARE THE BEST

ONLY
WE DO OUR BEST






PRASAD PROCESS PRIVATE LTD
CHANDAMAMA BUILDINGS MADRAS-26

